# వెట్టివెంగళప్ప కవిలె కట్ట

అవతారం

సాంబశివా సదాశివ శంభోశంకర
తవ చరణంమే భవ తరణం!

ఓ అఖిలసనాతన వర్ణాశ్రమాచారనిరతదుష్టాంగమానస పుత్రసంస్కారవాసక ప్రత్యక్షశాస్త్ర సద్వంశకులారా! వరాహ! బహుపరాహ!! మన ధర్మకపిలగోవను నాలుగుకాళ్ళపై నిలబెట్టుటకు సికింద్రాబాదు పుణ్యతీర్థములో సాక్షాత్తు మహాశంకరుడే అవతారమెత్తినాడు. అతని పేరు మీకు తెలుసునా, అతడే నీలకంఠము గారు. ఉత్త నీలకంఠంకాదు, వంగపల్లినీలకంఠం గారు. శివుని కి కంఠములో మాత్రమే నలుపు. ఈ అవతారము లో శివుడు అఖండనీలవర్ణదేహముతో అవతరించి నారు. మీరుత్తమాటలు చెప్పితేనమ్మరు. శాస్త్ర ప్రమాణాలు కోరుతారని నాకు తెలుసును. నాకు అవతారం ప్రకాశమానం అయిందని మొన్నటి గోలకొండలో చూచి తెలిసినవెంటనే నావద్దనుం డే స్కాందపురాణాన్ని తిరిగేసితిరగేసి పరిశోధన చేసినాను. తుదకు శిఖంధరతీర్థమాహాత్మ్యఘట్టంలో ఈశ్లోకం కనపడింది:—

"కలౌ పంచ సహస్రాణి
జాయతేవం నీలకంఠః"

ఇంకేముంది, మీరంతా నమ్మకలసియుంటుంది. యింతకుముందు కొన్నిరోజుల్నుండి సిద్దీఖ్ దీన్దార్ గారు నేను బసవేశ్వరునిఅవతారంఅని చెప్పుకుంటూ ఉన్నాడు. ఆదెట్లనయ్య అంటే నాబీపున నాగఫణిమచ్చ ఉందిచూచుకోండి, అందరికినీ చూపించుకొంటున్నాడు నెత్తినకూడ నాగఫణివాత మొన్న మొన్ననే ఏర్పడిందని విన్నాము. యని వం నీలకంఠం పూజ్యపాదుల వారికి శివలక్షణాలేమేమిఉన్నవిఅని మీరు ప్రశ్నించుతారా? అపచారము! మహాపచారం!! మహాత్ముల విషయములోను నదుల జన్మస్థానం విషయాలలోను సంశయములు పెట్టుకోగూడదని శాస్త్రిలు వ్రాసినారుకుమా. శాస్త్రిలను ధిక్కరించే అధికారంఉందా మరి? మూడవకన్ను, ఏనుగుతోలు, చేతిలోకప్పెర, త్రిశూలము, విభూతి, ప్రమథగణాలు ఇవన్నీ అవసరంకొద్ది భక్తుల కుమాత్రం వ్యక్తంకాకుండా ఉంటవా? ఓపిక పట్టండి. సదాశివపేటలో లెక్చరుకొట్టిన శాస్త్రిగారు ఈసందేహాలన్నింటికిని మీకు నమ్మకమైన ప్రమాణాలు చూపించుతారులెండి.

ఒకటి, రెండు, మూడు.

కొంతకాలంక్రిందట మద్రాసులో కొందరి ఆంధ్రప్రముఖులతో మాట్లాడుతూ నవాబుబహదర్ యార్జంగుబహద్దరు గారు "నాకు తెలుగు బాగా వచ్చును. నాకు తెలుగువారిహృదయం తెలుసు. నా రైతులు తెలుగువారు నాకు తెలుగు వ్రాయుటకు మాడంకెలవరకొచ్చును." అని చెప్పి ౧, ౨, ౩ అనుమూడు తెనుగంకెలు సరిగా వేసిచూపినారు. ఆటుతర్వాతఅంకెలు వారికి రానట్లే. ఇంతమాత్రమైనా తెనుగువచ్చిందికదా— అనిసంతోషపడవలెను. నవాబుగారు తెనుగులోని అస్సలురహస్యాన్ని గుర్తించినారు— పూర్వముబంగొబస్తుకార్యాలయంలో ఒకడు తెనుగంతా అంకెలలో వేస్తున్నాడని అన్నాడట— అదెట్లన్యాఅంటే తానుగ్రామంలోకిపోయి పటేలును పిలిచినాడు— వంటకపైసా కావలెనన్నాడు— "అరే కట్టెలుతీస్కరో" అన్నాడు" పటేలు- కార్యాలయం తననోటుబుక్కులో ఇట్లు వ్రాసుకున్నాడు.

"తీస్(30)కరాలా. మర్నాడు మళ్లీకట్టెలుకావలసివచ్చింది "[illegible]" అన్నాడుపటేలు. "పచ్చీస్(25)రో = లానా." అని తనడైరీలో కర్నూలు వ్రాసుకొని దానికిందఒకనోట్ వ్రాసుకున్నాడు. "నిన్నటికీ ఈనాటికి అప్పుడే తేడాకలిగింది. నేను అరగంటలో పలుచనైపోయినాను. నిన్న30 కరాలా అనికోడు [illegible] అన్నాడు. 25 తగ్గిపోయినవి" మూడవనాడు కొలతఅవుతుందని ఊళ్లో "చాటుకరా" అన్నాడుపటేలు. కర్నూలు డైరీతెరిచి "సాట్(60)కదా = దండోరావేయుట" అని వ్రాసుకొని మర్నాడు పటేలుతో ఇట్లాఉర్దూలో అన్నాడు పటేల్‌సాబ్. నీ తెలంగీఅంతా జల్దీజల్దీ నేర్చుకొనేస్తా. అంతాఅంకెలలోనుందిమీ తెలంగీ." ఈరహస్యాన్నే నవాబుగారు కనిపెట్టినారు.

గడ్డం గిరాకీ

నాకు గడ్డంఅంటేసరిపడదు. నేను కొత్తగా హైదరాబాదుకువచ్చినప్పుడు శుద్ధ సనాతనంగా గోష్పదమంత జుట్టు పెట్టుకొని వచ్చినాను. ఒక స్నేహితునియింటికిపోతే అచ్చటసుమారుగరిమంది ఒకమౌల్వీసాబ్ వద్ద ఉరదుచదువుతూఉన్నారు. నన్నుచూచినాసంగతిసందర్భం విచారించినారు. నాకుఉరదురాదు— మౌల్వీసాబుకు తెలంగీరాదు. నాస్నేహితుడు దుబాషీపనిచేసినాడు. మౌల్వీ గారట్లన్నారు. "మీరంతా జుట్టుతీసివేస్తే ఈయనెందుకు ఇంతమోపడంత మోపు పెస్తనమోస్తున్నాడుపాపం!" నాకుదానితర్జుమా ముక్కకు ముక్కచేసి తెలిపినాడు నాస్నేహితుడు. నాకు అప్పట్లో చాలాసనాతనాభిమానం (ఈ మధ్య కమ్యూనిస్టుసంతకాలచేరచ్చి ఆకోస్త పట్టుకొన్నట్టిది ఊడిపోయిందిలెండి.) అందుచేత పట్టరానికోపంవచ్చి "అయితేమీరంతా గడ్డాలు కొరిగించుకొని ఉంటే ఈమౌల్వీయెందుకు జానెడుగడ్డముపెంచినాడు" అడగండిఅన్నాను. మౌల్వీసాబు తర్జుమానువిన్నాడు. కోపంలేదు తాపంలేదు. తటాలునలేచి చేతిలోచేయి కలిపినాడు. "మహ్మారాక్ ముక్కకుముక్క, సవాల్‌కుసవాల్. భేష్, లాజవాబ్ సవాల్‌వేసినావ్. మీ మతం చెప్పినట్లూ మీరు చేసినార్ మా మతం చెప్పినట్లూ మేముచేసినాం" అని ఒక చిన్న లెక్చరు కొట్టినారు ఎట్లయితేనేమి ఆనాటినుంచి నాకు గడ్డాలఅంటేగిట్టదు. కాని ఒకనెలదినాలనాడు ఒక పెద్దమనిషి తనశిష్యులకు తనగడ్డాన్ని అమ్మితే ౧౭,౦౦౦ రూపాయిలు వసూలుఅయినావని పత్రికలలో చూచి నాఅభిప్రాయాన్ని మార్చుకొన్నాను. గడ్డంవంటిదేజుట్టుకూడాఅని నైవనిరూపించినానుకదా. నేనుమళ్ళీ జుట్టుపెంచుతూ ఉన్నాను. మళ్లీసనాతనుని జుట్టుహద్దువరకు అవుతున్నాను. నాజుట్టునున్నూ ౧౭,౦౦౦రూ|| గిరాకీ వస్తే (కమీషనుసంతకాలవలె) నేను తప్పకుండా శుద్ధసనాతనునిఅవుతాను. నాకు సంస్కారమంటే ఏమిన్ని భయంలేదు. వారిబండారమంతా తెలిసిపోయింది మొన్ననే బాల్యవివాహశాసనంవద్ద ఏపార్టీగెలిస్తే ఆపార్టీలో నేనున్నానని ఒకచేపుర్తి. ఇప్పటికి సెలవు.

— వెంగళప్ప —

## ముసోలినిఆహ్వానమును తిరస్కరించినరోజు

పండితజవహర్లాలు జీవితములోని ఒకఘట్టము.

పండితజవహర్లాలు జీవితములో ఒక ధీరమైన ఘట్టమును యుడ్వర్డుథాంప్సన్ గారు "ఈవినింగ్ స్టాండర్డు" అనుపత్రికలో ఒకవ్యాసమందు తెలిపినారు. జవహర్లాలుగారు యూరోపుఖండము లో ప్రయాణముచేయుచు రోంనగరమునకు వచ్చినప్పుడు అక్కడ వారుదిగినచోట ఇటాలీయ ప్రభుత్వవిదేశాంగశాఖకు చెందినఒకఅధికారి వారిని ముసోలినిగారిని దర్శించుటకై రావలసినదని ఆహ్వానించి కొనిపోవుటకు కారుతోకూడసిద్ధముగానుండెను. కానిజవహర్లాలుగారు రానునిరాకరించిరి. మ్యూనిచ్‌ఒడంబడికకుకొద్దికాలముముందు చేసుకును. స్పెయినులోఅంతర్యుద్ధమునందు బార్సిలోనాకును, జపానీయులవిమాన దాడు లనుయున్నలో చంగ్‌కింగ్‌కునుపోయి వారి ఏమి చెప్పినదియు అందరికిని తెలిసినసంగతియే. అట్టిసి ఫాసిస్టుకార్యమును ప్రోత్సహించుచు యుద్ధము చేయుచున్న ప్రభుత్వమునకు ఎదురుతిరుగుట ఆశ్చర్యమని థాంప్సన్ గారు చెప్పినారు. ఇందుకు తప్ప భారతీయజనుల భావములను గ్రహించలేని బ్రిటిషుప్రభుత్వము [illegible] చెప్పటకు సులభముని సూచించుచు ఒక వ్యంగ్యచిత్రము థాంప్సనుగారి వ్యాసముపై ముద్రించబడెను—

## హవనానికై ప్రభుత్వ భవనానికి ప్రయాణము

మళ్ళీ ఆర్యసమాజీయుల అరెస్టు

ఆర్యసమాజపు పోస్టరు [illegible] సభ్యులనిఇరువురిని [illegible] బొంబాయిపోలీసువారు [illegible] అరెస్టుచేసిరి. [illegible] హవనము చేయుటకై ప్రభుత్వభవనమునకు [illegible] భారతదేశరక్షణ నియమానుసార అరెస్టు చేయబడిరి.

# ఆంధ్రోద్యమ ప్రచారము

## ఆంధ్ర మహాసభాధ్యక్షులవారి మెదకు జిల్లాలో పర్యటన

(ప్రత్యేకవిలేఖరి)

౧౩౫౦ ఫ. ౨౮ ఇస్ఫందారు తేదిన హైద్రాబాదునుండి ఆంధ్రమహాసభాధ్యక్షులగు శ్రీయుత మందుముల రామచంద్రరావుగారు, ఆజిల్లాసంఘోపాధ్యక్షులగు శ్రీయుత కంది శ్రీనివాసరావు, కార్యకారిణీసభాసభ్యులగు శ్రీ వట్టికోట ఆళ్వారుస్వామిసహా బయలుదేరి కంది గ్రామమున కేతెంచిరి. కందిలో జిల్లాసంఘ కార్యదర్శియగు శ్రీ జి. రామారెడ్డిగారు, శ్రీ వేంకటరాజేశ్వరజోషీగారు అధ్యక్షులవారిని కలిసికొని పర్యటనలో పాల్గొనిరి. కందినుండి నందికంది మీదుగా సదాశివపేటకు ౧౧-౨ గంటలకు చేరుకొనిరి. సదాశివపేటలో ప్లేగువ్యాపించి గ్రామం వదలినందున సమావేశము జరుగలేదు. అచటిపరిస్థితులు కనుక్కొని భోజనానంతరము తిరిగి నందికంది జిల్లాసంఘాధ్యక్షులగు శ్రీ బచ్చు వేంకటేశ్వరగుప్తగారి సహా విచ్చేసిరి. నందికందిలో రైతులు, వర్తకులు, సమావేశమై తమతమ అవసరములు తెలుపుకొనిరి. వారికి సముచితసలహాలనొసగి కంది గ్రామమునకు ప్రవేశించిరి. కందిలో స్థానికులు, చుట్టుప్రక్క గ్రామాదులవారు సమావేశమైరి. సభికులకు ఏతెంచిన ప్రముఖులను శ్రీ జోషీగారు పరిచయపరచిరి. పిదప జిల్లా సంఘాధ్యక్షులును, మహాసభాధ్యక్షులును, ఆంధ్రోద్యమము ఏవిధముగ దేశీయుల సేవచేయుచున్నది విశదపరచుచు దేశీయులు ఈసంస్థను బలముకలుగజేసి లాభముపొందవలెనని తెలిపిరి. కార్యక్రమములో చేరని గ్రామమగు మల్కాపురం [కొత్తగడి] రైతులువిచ్చేసి తమ గ్రామమునకు ఏతెంచి అచటిరైతులకు ప్రబోధముచేయవలెనని నిర్బంధపెట్టినందున సంగారెడ్డి వెళ్ళి అచ్చటి నిర్ణీత కార్యక్రమం ముగించుకొని రాత్రి ౯ గంటలకు మల్కాపురం గ్రామమునకు అధ్యక్షులవారు తమ పరివారముతో సహా ఏతెంచిరి, పురవాసులు సుమారు ౩౦౦ వందలమంది సమావేశమై వారిసన్న శంకలను వ్యక్తపరచిరి. అధ్యక్షులవారు ఆశంకలన్నింటికి సమాధానమిచ్చుచు ఆంధ్రమహాసభాశయములను, దానికార్యక్రమమును, అది మతపార్టీ భేదములను లేకుండ ఏవిధముగ జాతీయపునాదులపైన నడుపబడుచున్నది దేశీయులకు ఏవిధముగ సేవచేయుచున్నది స్పష్టపరచిరి. జిల్లాసంఘోపాధ్యక్షులగు శ్రీ కంది శ్రీనివాసరావుగారు దేశీయులు ఆంధ్రమహాసభలోచేరి బలముకలుగజేసి దీనివల్ల లాభము పొందవలెనని కోరిరి. ౧-౨ గంటలకు బయలుదేరి తిరిగి సంగారెడ్డికి ఏతెంచి విశ్రాంతిగైకొనిరి.

౨౯ ఇస్ఫందారు తేదిన ఉదయము ౭ గంటలకు సంగారెడ్డినుండి చౌటకూరుకు ప్రవేశించిరి. గ్రామము వెలుపలకు గ్రామవాసులు వాద్యములతో విచ్చేసి స్వాగతమిచ్చిరి, పరిసరగ్రామాదుల రైతులు సమావేశములో పాల్గొనిరి. చౌటకూరునుండి అందోలు గ్రామమునకు ప్రవేశించిరి అంతవరకే వేచుకొనియుండిన పురవాసులు ఏతెంచిన ప్రముఖులతో కలిసికొని తమకున్న ప్రత్యేకకష్టములను వెల్లడించుకొనిరి. వారికి అధ్యక్షులవారు సముచిత సలహాలనొసగి జోగిపేటకు ౧-౨ గంటలకు ప్రవేశించిరి, గ్రంథాలయము ఆవరణలో పురపౌరులు, చుట్టుప్రక్క గ్రామాదులనుండివచ్చినవారు సమావేశమై అధ్యక్షులవారికి సన్మానపత్రము సమర్పించుకొనిరి. జవాబులో హిందూప్రజామండలి, సనాతనధర్మసంస్థ, యిత్తెహాదుల్ ముసల్మీన్, ఆర్యసమాజము, ఈ సంస్థల ఆశయము లేమి? ఆంధ్రమహాసభాశయ లక్షణము లేమి? ఆంధ్రమహాసభ ఏవిధముగ జాతీయపునాదులపైన నడుపబడుచున్నది, స్పష్టపరచిరి. జోగిపేటనుండి అల్లాదుర్గములో శ్రీ కంది శ్రీనివాసరావు, జి. రామారెడ్డిగారలను వదలి అధ్యక్షులవారు శంకరంపేటకు ప్రవేశించిరి. శంకరంపేటలో పరగ్రామాదులనుండి విచ్చేసిన రైతులు సుమారు ౪౦౦ వందల మంది సమావేశమైరి. అచ్చటసన్మానమర్పింపబడెను. ఒక గంటసేపు అధ్యక్షులవారు ఆంధ్రోద్యమమునుగురించి విపులముగా ఉపన్యసించిరి. రాత్రి ౯ గంటలకు గ్రామవాసులంతా గ్రంథాలయఆవరణలో సుమారు ౫౦౦ మంది సమావేశమైరి.

౩౦ వ ఇస్ఫందారునాడు శంకరంపేటనుండి నిజాంపేటకు ప్రవేశించిరి. సుమారు (౩౦౦) మందిసమావేశమైరి. అధ్యక్షులవారు ఒకగంటవరకు ప్రబోధించిరి. అటుపై అచ్చంపేటపౌరులతో ముచ్చటగోష్ఠిగ ముచ్చటించుకొని ఎల్లారెడ్డిమీదుగా లింగంపేటకు అధ్యక్షులవారు వెళ్ళిరి. తర్వాత ఎల్లారెడ్డిలో పురపౌరులు, పరస్థానిక రైతులు సుమారు ౫౦౦ మంది సమావేశమై తమతమకష్టములను తెలుపుకొనిరి. తర్వాత మత్తమాల గ్రామమునకు సాయంత్రము (౭) గంటలకు ప్రవేశించిరి.

(౩౧) యిస్ఫందారు తేదిన ఉదయము ౭ గంటలకు మత్తమాలనుండి బయలుదేరి పోచారమునకు అధ్యక్షులవారు ఏతెంచిరి. పోచారము ప్రజలు సమావేశమై తమకష్టములను తెలుపుకొనిరి వారికి సముచితసలహాలనిచ్చి బూరుగుపల్లి గ్రామమునకు చేరిరి. బూరుగుపల్లి గ్రామపు రైతులు అధ్యక్షులవారిని కలిసికొని తమకున్న స్థానిక యిబ్బందులను వ్యక్తపరచిరి. బూరుగుపల్లెనుండి బయలుదేరి మెదకునకు అధ్యక్షులవారు ప్రవేశించిరి. ప్లేగు వ్యాధివ్యాపించి గ్రామం వదలినందున సమావేశము జరుగలేదు.

అధ్యక్షులవారు అవుసలిపల్లి (జాగీరు) గ్రామమునకు ప్రోగ్రాంలో లేకపోయినను అచటి రైతులు వచ్చి నిర్బంధపెట్టినందున ఏతెంచిరి: అచటి రైతులు, వర్తకులు, తమతమ కష్టాలు తెలుపుకొనిరి. వారికి తగిన సలహాలనిచ్చి రామాయంపేటలో [౫, ౬) వందలమంది సమావేశమైరి. వారికందరికి అధ్యక్షులవారు ఆంధ్రమహాసభా ఉద్దేశములను రైతులకు, బీదలకు, ఏవిధముగా వారివారి అవసరంలలో కష్టములలో సహాయపడి పనిచేయుచున్నది వ్యక్తపరచిరి, శ్రీ ఆళ్వారుస్వామిగారు దేశీయవస్తువులు, ఖాదీ ఉపయోగము వల్ల లాభమును, మద్యపానవష్టములను తెలిపిరి. మాసాయిపేటకు (౭) గంటలకు అధ్యక్షులవారు ప్రవేశించిరి. స్థానికులతో ఆప్రాంతపుకష్టములు, అవసరములు కనుక్కొని వారికి ఆంధ్రమహాసభ ఉద్దేశములను తెలిపిరి. మాసాయిపేటనుండి ౯ గంటలకు బయలుదేరి అధ్యక్షులవారు సపరివారముగ హైద్రాబాదుకు రాత్రి ౧౧ గంటలకు ప్రవేశించిరి.

—

# గోలకొండపత్రిక

విక్రమనామసం॥ర మాఘ శు॥ ౧౩

సోమవారము


## పౌరుల సాధారణ హక్కులు

దేశోద్ధారక గ్రంథమాలవారి ప్రచురణములను చందాదారులు ౫ చేరి తెప్పించుకొనిన ఒకరిద్దరికి ఇదివరలో పోలీసు ఉద్యోగుల వలన కలిగిన తొందర మా పాఠకులకు తెలిసియేయుండును. అదృష్టమువల్ల వెంటనే ఆచిక్కు పెట్టబడినవారలకు సమాధానము కలిగించబడెను. ఇప్పుడు మరల ఆగ్రంథమాలవారి 3 ప్రచురణములు అనుమానగ్రహాభిభూతములైనవి. ఈ సారి శేద మేమన సుంకపుశాఖకు చెందిన ఉద్యోగులు జోక్యము కలిగించుకొనినారు. మరియు దేశోద్ధారక గ్రంథమాల వారి ప్రచురణములతోపాటు ఆంధ్రకేసరి గ్రంథమాలవారి మూడు ప్రచురణములును చిక్కుకుగురియైనవి. ఇటువంటి సంఘటనలకు అవకాశము రాకుండ ప్రభుత్వమున్నతాధికారులు సరియైన వ్యవస్థను చేసియుంచుట అవసరము.

ఏకారణములచేతనైతేనేమి మన రాష్ట్రములో సాధారణముగా వ్యక్తులకుండే స్వాతంత్ర్యములు అనుభవమందు బ్రిటిషిండియాలోకంటె తక్కువగానున్నవి. బహిరంగసభలను జరుపుకొను విషయము, ఊరేగింపులు జరుపుకొను విషయము బ్రిటిషిండియాలోకంటె ఎక్కువకట్టులచే బంధితములైయున్నవి. ఈసాధారణమైనవాటికితోడుగా ఇదివరలో సత్యాగ్రహానవయమున చేయబడిన ప్రజాక్షేమ సంరక్షక శాసనము, ఇప్పుడు ప్రపంచ యుద్ధకారణముచెప్పి చేసినట్టి హైదరాబాదు రక్షణనియమావళియు స్వాతంత్ర్యములను మరికొన్ని కట్టుబాట్లకు లోనుచేసినది. ఇప్పటికైనను ఉన్న శాసనాలు, నియమాలు, సంప్రదాయాలనుబట్టి కొన్నిస్వాతంత్ర్యములు తమకు ఉన్నవి, వాటికి ఇప్పటికిని భంగములేదు అని ప్రజలు తలచుచున్నారు. అట్టివాటికిగూడ ప్రభుత్వమువారి శాసనము లేకయే, క్రింది ఉద్యోగులవల్ల దెబ్బతగులుచో, అది అనవసరముగ ప్రజలకు మనస్తాపము కలిగించును.

ఎవరైనను ప్రజలు తమవెంట ఏదేని పుస్తకములను తీసికొని పోవుచున్నపుడు అవివరియైన ప్రభుత్వాజ్ఞచే నిషిద్ధములు కానంతవరకు స్వప్రభుత్వోద్యోగులుగాని వాటిని అప్పటికప్పుడు ఇచ్చివేయగలరనియే సాధారణముగ అనుకొనుచుందురు. అంతేగాని పోలీసులయినను, లేదా సుంకపు అయినను నట్టి చిన్నఉద్యోగులు అపుస్తకములలో ఏమి ఆక్షేపణీయాంశములున్నవో చూచెదమనియో, లేదా అపుస్తకములు ప్రజలవద్దగ్గర ఉంచుకొనదగనివనియో చెప్పి ప్రయాణీకుల వద్దనుండియు, ఇతర పౌరులవద్దనుండియు తీసికొనికొన్ని రోజులుతమవద్దనుంచుకొనవచ్చునని ఎవరును అనుకొనుటలేదు. ఇట్లు అనుకొని దానికి విరుద్ధముగా పోయిన ఇన్ఫందాను నెల ౨౯ వ తేది సాయంత్రము కాచిగూడెం రైలుస్టేషను దిగివచ్చుచుండిన శ్రీ పి. హనుమంతరావు (వకీలు) గారివద్దనుండి దేశోద్ధారక గ్రంథమాల ప్రచురణములును, ఆంధ్రకేసరి గ్రంథమాలవారి ప్రచురణములును కలిసి ఏనుపుస్తకములను సుంకపుఅమీను మున్నగువారు పరీక్షార్థమని చెప్పి తీసికొని రశీదిచ్చిపంపిరట. ప్రభుత్వమువారు నిషేధించిన పుస్తకములపట్టిక ఒకటి మీవద్ద ఉండునుగదా, దానిలో ఈ పుస్తకముల పేర్లు ఉండునది లేనిది చూచుకొని లేకున్నచో నాపుస్తకములను వదలిపెట్టండి, ఇవి ఇక్కడ నిజాంరాష్ట్రములోని ప్రచురణములేఅనిహనుమంతరావుగారు మనవి చేసికొనినను ఆఉద్యోగులు వినిపించుకొనలేదట. సుంకపు అమీను, ఇంకను చిన్నచిన్న ఉద్యోగులుకూడ తమకంటికి కనబడిన పుస్తకాలను తాము స్వయంగాపరీక్షించిగానివదలజాలమని అనుటకు మొదలుపెట్టుచో పౌరుల జీవనము ఎంత విశ్వతమగునో ప్రభుత్వమువారు కరుణతో ఆలోచింతురుగాక!

క్రొత్తగా పుస్తకములు అచ్చుకొట్టించినపుడే వాటిప్రతులను పోలీసు ఉన్నతాధికారులకును, వహోంశాఖకును పరీక్షార్థము పంపుచున్నారు. ఆక్షేపణీయగ్రంథముల నిషేధము వేగముగా జరుగుటకై ఈకేంద్రస్థానములందు ఇంకను మంచి వ్యవస్థనుచేసికొనుట ఉత్తమముగాని, ప్రతిచిన్న ఉద్యోగికిని ఆక్షేపణీయగ్రంథమా కాదాయని పరీక్షించే అధికారముండుట యుక్తముకాదు. అందువల్ల నిజముగా ఆక్షేపణీయములైన గ్రంథములు తప్పించుకొనుట ఒక్కొక్కప్పుడు తటస్థించవచ్చును. ఇది ప్రభుత్వమువారికి నష్టము. ప్రజలకు కష్టమేమి నిన, నిరాక్షేపమైన గ్రంథములు చీటికిమాటికి అనుమానాలకుగురికావచ్చును. అనుమానంతో చిన్నఉద్యోగులు కోరినపుడెల్ల తనవద్ది నిరాక్షేపములైన పుస్తకములనుకూడ ఇచ్చివేసి వాటిని తిరిగి సంపాదించుకొనుటకై తన ఇతరముఖ్యకార్యములను వదలి అనవసర వ్యయములను మీదవేసుకొని ప్రయత్నించవలసి వచ్చుచుండుట సంతోష జీవనమునకు పానకములో పుడకవంటిదే.

ఈసందర్భమున ప్రజానాయకులకు ఒకసూచన. మనరాష్ట్రమందు పరిభుత్వజ్ఞులు, గక్షీలు, ఖానూనులు, స్థిరపడియున్న సంప్రదాయములు ఏఏ పౌరస్వాతంత్ర్యములను ఎంతెంతవరకు సుఖముగా అనుభవించుకోనిచ్చునవిగా ఉన్నవో వాటివాటిని అంతంతవరకైనను ప్రజలు అనుభవించుకొనగలుగునట్లు కనుపెట్టియుండి, ఆ అనుభవమునకు క్రమవిరుద్ధమైన దెబ్బతగిలినప్పుడు వెంటనే తగిన శాసనసమ్మతమైన ప్రయత్నము చేసి న్యాయమును స్థిరపరచుచుండుటకై యత్నించు ఒకసంఘము శాఖోపశాఖలతో రాష్ట్రమంతటికిని ఉపకరించునట్టిది ఏర్పాటుచేయబడుట అవసరమని స్ఫురించుచున్నది.

---

## ఓరుగల్లు ద్వితీయ ఆంధ్రమహాసభ

ఆహ్వానసంఘ ప్రకటన

మానుకోట, ఫర్వరి 3

ఓరుగల్లు ద్వితీయాంధ్రమహాసభ ౮, ౯, ౧౦ ఆర్దీబెహస్తు ౧౩౫౦ ఫసలీ తేదీలలో జరుగగలదు కావున సభా సమావేశముల కాంధ్రులందరును విచ్చేయప్రార్థితులు.

ఏతత్సభాసమయమున వద్యములు వాసి నవదలడిన అంధ్రకవులు తమతమరచనలను ౨౫-౫-౫౦ ఫసలీ నాటికి ఆహ్వానసంఘమునకంపవలయును. రచనలు ఆంధ్రోద్యమాభివృద్ధికి సంబంధించినవిగా నుండవలయును.

ప్రదర్శనములను, సభలో ప్రవేశపెట్టదలచినవారు తీర్మానములను వానిపై తేదీనాటికే ఆహ్వానసంఘమునకందజేయవలయును.

ఆంధ్రోద్యమమునకు సంబంధించిన సమస్యలపై ప్రత్యేకముగా, ఉపన్యసించదలచినవారు ఉపన్యాసము యొక్క ఒక ప్రతిని పై తేదీవరకు ఆహ్వానసంఘమునకంపినయెడల వీలునుబట్టి సభవారి కిత్తవకాశమీయబడును.

మానుకోటనుండి సభజరుగు "పూసపల్లి" గ్రామము మూడు మైళ్ళుగలదు అందుకు సాధారణమైన (లోకల్ ఫండుకోడ్డుగలదు) ప్రయాణీకుల సౌకర్యార్థమై పలుబస్సులు రెండు మోటారుబస్సులు అవశ్యకమని తలచబడినవి. ౭-౬-౧౩౫౦ ఫసలీ మధ్యాహ్నమునుండి ౧౨-౬-౧౩౫౦ ఫసలీ మధ్యాహ్నమువరకు యిట్టి బస్సులునడపుట అవసరము ఎవరైన మోటారు కంపెనీవారు ముఖ్యముగా "ఆరీది" ఆవశ్యకతను మోటారు బస్సులను కిరాయిపైనపంపుట కుద్యుక్తులు గానున్నచో ౨౦-౫-౧౩౫౦ ఫసలీ వరకు తెలుపవలయును. ప్రయాణపు రేట్లు, వసతు మొదలగువాని నిర్ణయము ఆహ్వానసంఘము వారి అభిప్రాయమునననుసరించి జరుగవలసి యుండును.

శ్రేష్ఠుల భోజనవసతికై బ్రాహ్మణభోజన హోటళ్ళ యజమానులెవరైన ఆహ్వానసంఘము వారు నిర్ణయించు రేట్లపైనను పద్ధతులపైనను ఏర్పాటుచేయగలమనువారల మున్ముందుగా ఆహ్వానసంఘముతో సంప్రదించి కంట్రాక్టును స్థిరపరచుకొనవలయునని ప్రార్థన.

గ్రంథమాలవారుగాని, పుస్తకములవిక్రేతలుగాని, ఖాదీభాండాగారములవారుగాని లేక ధార్మికసంస్థలవారుగాని సభాసరములన తమకు ప్రత్యేకస్థలము కావలసియున్నయెడల ౨౦-౫-౧౩౫౦ ఫసలీ వరకు తెలిపినచో అవకాశమునుబట్టి ఆట్టిఏర్పాట్లుజేయుటకు వీలుండునని తలంచుచున్నాము.

జిల్లాసభలతోపాటు మహిళామహాసభ (ఓరుగల్లుజిల్లా)గూడ జరుపుటకు ప్రకటించియుంటిమి కావున ఆస్త్రీమహిళా సభకు శ్రీమతి ఆచంట లక్ష్మమాంబగారు (మానుకోటపురస్థానికులు) ఆహ్వాన సంఘాధ్యక్షురాలుగా ఎన్నుకొనబడియున్నారు కావున మహిళాసభకు సంబంధించిన ఉత్తరప్రత్యుత్తరములు ఆహ్వానసంఘముతోనే జరుగుచుండును.

మహిళాసభకు అధ్యక్షురాలింకను ఎన్నుకొనబడలేదు. గావున ౨౦-౫-౧౩౫౦ ఫసలీలోగా ఓరుగల్లుజిల్లా ఆంధ్రమహిళామణులు అధ్యక్షురాలి నెన్నుకొని ఆహ్వానసంఘమునకు తెలుపవలయునని కోరుచున్నాము:

ఇట్లు,
కొమరగిరి నారాయణరావు
కార్యదర్శి,
ఆహ్వానసంఘము.

---

## నిజాంరాష్ట్ర చేనేత పారిశ్రామికసభ

మానుకోట. తేది ౨-౨-౧-౪౧

(ఒక విలేఖరి)

శ్రీయుత గుంటుక నరసయ్యపంతులు గారిక్కడికి వచ్చిరి. నిజాంరాష్ట్రచేనేత పారిశ్రామికసభల ధ్యక్షులు శ్రీయుత వనం కృష్ణమూర్తి (హైకోర్టు వకీలు), కార్యదర్శి శ్రీయుత డా. మూర్తి వీరయ్యగార్లతో కలిసి మాట్లాడిరి. ద్వితీయనిజాంరాష్ట్రచేనేత పారిశ్రామికమహాసభ జరిపించువిషయమున ఆలోచించుకొనిరి రానున్న పాల్గుణమాసములోనో లేదా చైత్రమాసములో మహాసభజరిపించుటకు పూర్తిగ నిశ్చయింపబడినది. సభ జరిపించుటకై తగుప్రచారం వ్యవస్థను గావించు విషయమున చురుకుగా ప్రయత్నములు జరుగుచున్నవి.

---

## వరంగల్లు జిల్లా ప్రథమ నిజాంరాష్ట్ర ఆంధ్ర గ్రంథాలయ మహాసభ

౩౦-౧-౪౧న కంఠం సెట్టులో జరిగిన "విజ్ఞాననికేతన గ్రంథాలయ" వార్షికోత్సవసందర్భమున సమావేశమైన యితర గ్రంథాలయ సభ్యులందరితో ౩౧-౧-౪౧న ఒకసమావేశము జరుపబడెను. అందు అర్దిబెహస్తు ౨౬-౯-౧౦ తేదులయందు అనగా ఫాల్గుణశుద్ధపూర్ణిమ హోలీపండుగ కలవు లయందు మానుకోట సమీపమందలి యాదుల పూసపల్లిలో వరంగల్లుజిల్లా ప్రథమ నిజాంరాష్ట్ర ఆంధ్రగ్రంథాలయమహాసభను జరుపుటకు తీర్మానింపబడినది. ఆహ్వానసంఘ కార్యదర్శులుగా శ్రీ డాక్టర్ గోపాలరావుగారు (మానుకోట)ఏర్పడినారు. శ్రీఒడ్డిరాజా రామేశ్వరరావుగారిని మహాసభకు అధ్యక్షులుగాయెన్నుకొనిరి. సభా కార్యక్రమములు చురుకుగా జరుగుచున్నవి. వరంగల్లు జిల్లాయందలి అన్నిగ్రంథాలయముల సభ్యులును యిందు పాల్గొని సభను జయప్రదముగాజేయవలయును. ఆ సేతముఖ్య విషయములు విద్యావిధానముపై విజ్ఞాన ప్రచారముపై చర్చింపబడును.

యాత్రికసంఘములను శ్రీ డాక్టర్ గోపాలరావుగారు మహబూబాబాదు రైల్వేస్టేషన్ అను ఆడ్రసుకుగాని టి. హయగ్రీవాచార్యులుగారు, హనుమకొండ అను అడ్రసుకుగాని వ్రాసి తెలుసుకొనవలయును.

యీనాటిసభాధ్యక్షులు శ్రీఆచార్య ఇల్లిందల సీతారామారావుగారు శ్రీవరదాచారిగారావుగారు హైకోర్టువకీలు మొదలగు ప్రముఖులందరు సమావేశములో పాల్గొనియుండిరి.

పం. రామానుజస్వామి
ని.ఆం.గ్రం॥ సంఘము
కార్యదర్శి.

---

## మోసర

బావిలో వైశ్యయువకుని శవము

ఇదినిజామాబాదుజిల్లాలోనిది ఇక్కడఒక వైశ్యయువకుడు నాటిరాత్రిఅదృశ్యుండగుటచే సమీపపట్టెలు చెరువులు బావులు అన్నియు వెదకినను కనబడిరికాని ౨౮-౪-౫౧ నాడు అతని నివాసగృహాల్లు చేదబావిలోనే పైవాలికవము గోచరమయ్యెను. వెంటనే పోలీసుకు తెలియపరచగా బోధన్ పోలీసుమునసబుగారువచ్చి సాయంత్రం ౫ గంటలకు పంచునామాచేసి జారశ్రీ మోహావేశమునకుగురియై ఏమోసమాశ్యముజరిగినదని ఎల్లరకదంతియుండుటచే శైశవమును పోస్టుమార్టంకొరకు బోధన్ ఆస్పత్రికి పంపించిరి, ౩౧-౪-౫౧ నాడు శవపరీక్ష అయినతరువాత శవమును బంధువులకొసగబడెను. తోడనే మిక్కిలిసమీప జ్ఞాతిపోకల కిష్టన్న అనువాడు శాస్త్రోక్తముగా దహనక్రియలు నెరవేర్చెను. వైశ్యయువకునకు ఒక బాలికయైన భార్యగలదు.

ఇట్లు,
చింతల విఠల్ గుప్త.
మోసర

---

## రక్షకభటుని కక్ష

నేను బోధన్ (నిజామాబాదుజిల్లానుండి నిజామాబాదకు ౩౦-౪-౫౧ తేదినాడు మోటారుబస్సులో ప్రయాణముచేయుచుండగా జానకంపేట నిజాంషుగర్) పైనఒక సాధారణమైన వ్యక్తి మోటారులోఎక్కను తోడనేయున్నదను గర్జనధ్వనితో నీవెవరని అడిగెను. ఎందుకని ప్రశ్నించితిని పుడు, నీదిప్రాంతి ఏది అని ప్రసంగముమొదలిడెను. సాధారణవ్యక్తికి ఇంతదబాయింపేమని తోచకపోవుటచేతనాడును ఇతడెవరని తెలుసుకొనగా ఎడపల్లి (నిజామాబాదు) పోలీసుజవానని తెలియవచ్చెను. తోడనే సాహెబు నేను మోసరా (నిజామాబాదు) నివాసినంటిని ఉభయులము నిజామాబాదులో మోటారునుండి దిగినతోడనే ఏమనుపేరుచెప్పలేదని ఒకనేరమును నాపైతగోపించిదిలా నాకునమ్మగానిపోయెను. అచ్చటమొహలీక్ గారు జరిగినసంగతంతయువిని గౌరవవాక్కులచే నాపకలవాసంగిరి

మొరానారాయణ గుప్త,
మోసర (నిజామాబాదు),

---

## హైదరాబాదు బజారు ధరలు

తేది ౯-౫-౫౦ ఫ.

పల్లా ౧కి ౧౨౦ సేర్లచొప్పున ధరలన్ని యిట్లే.

| విస్తృతము | పల్లా ౧కి | | | |
|---|---|---|---|---|
| | రూ | అ | పై | |
| కిచిడి సాంబర్లు | ౨౫ | ౦ | ౦ | |
| నంబర్లు | ౨౩ | ౮ | ౦ | |
| ఢిల్లీకోగాలు | ౨౩ | ౦ | ౦ | |
| రాంసాగర్లు | ౨౧ | ౧౨ | ౦ | |
| నాజిగ్రీరు | ౧౯ | ౦ | ౦ | క్రొత్తవి |
| | ౨౧ | ౮ | ౦ | పాతవి |
| అర్కాటి | ౧౬ ౧౬ | ౮ | ౦ | క్రొత్తవి |
| | ౨౧, ౨౦ | ౮ | ౦ | పాతవి |
| కోమాటి | ౧౫ | మొదలి | ౧౭వరకు | |
| బుడ్డవులు | ౧౪ | ౮ | ౦ | |
| తేరాలి | ౧౫ | ౮ | ౬ | |
| గోధుమలు సర్బతి | ౧౯ | ౮ | ౦ | |
| బన్సి | ౯౮ | ౮ | ౦ | |
| బన్నుకీ | ౧౬ | ౮ | ౦ | |
| పోటిదిమా | ౧౬ | ౦ | ౦ | |
| ఎర్రగోధుమలు | ౧౪ | ౪ | ౦ | |
| జొన్నలు | ౧౦ | ౦ | ౦ | |
| తెల్లజొన్నలు | ౧౦ | ౪ | ౧ | |
| పచ్చజొన్నలు | ౭ | ౮ | ౦ | |
| మడికట్టుజొన్నలు | ౭ | ౧౨ | ౦ | |
| సెనగలు | ౧౨ | ౪ | ౦ | |
| కందులు | ౯, ౧౦ | ౬ | ౬ | |
| మినుములు | ౯ ౧౨ ౦ | మొదలి | ౧౦ ౮ ౦ | |
| అలసలు | ౧౨ | ౦ | ౦ | |
| సజ్జలు | ౭ | ౮ | ౦ | |
| కొఱ్ఱలు | ౭ | ౮ | ౦ | |
| పప్పు | | | | |
| సెనగపప్పు | ౧౫ | ౮ | ౦ | |
| కంది ,, | ౧౪౦ | | ౦ | |
| సెనగ ,, | ౧౯ | ౦ | ౦ | |
| అలస ,, | ౧౧ | ౪ | ౦ | |
| మినుప ,, | ౧౮ | ౦ | ౦ | |
| పెసర ,, | ౧౮ | ౮ | ౦ | |
| బెల్లము | ౧౨ ౦ ౦ | ౧౬ | ౮ ౦ | |
| ఉప్పు | ౧౨ | ౧౩ | ౦ | |
| వుల్లిగడ్డ | ౯ | ౮ | ౦ | వరకు |
| తెల్లనరువు | ౧౨ | మొదలి | ౨౨ | వరకు |
| చక్కెరములు (౪౦ సే) | | | | |
| జావా ,, ,, | ౧౪ | ౦ | ౦ | |
| బొంబాయి ,, ,, | ౧౩ | ౧౪ | ౦ | |
| మద్రాసు ,, ,, | ౧౩ | ౧౫ | ౦ | |
| నిజామాబాదు ,, ,, | ౧౩ | ౧౨ | ౦ | |
| ఎర్రచక్కెర ,, పల్ల | ౧౩, | ౧౨ | ౮ ౦ | |
| కర్పూరచక్కెర ,,(౪౦ సే) | ౧౬ | ౧౨ | ౦ | |
| ఎల్లిగడ్డ ,౧౨సే | ౨ | ౧౨ | ౦ | |
| అల్లం ,, ,, | ౧ | ౧౨ | ౦ | |
| మణుగు ౧౨ సే | | | | |
| కొబ్బరినూనె | ౪ | ౮ | ౦ | |
| నువ్వులనూనె ,, | ౩ | ౪ | ౦ | |
| మొదట్టనూనె ,, | ౩ | ౧౨ | ౦ | |
| వేరుసెనగనూనె ,, | ౨ | ౮ | ౦ | |
| పుంటినూనె ,, | | | | |
| కిరోసిన్ (గ్యాస్),, డబ్బా ౧కి | | | | |
| నెయ్యి దిమ్మలు ౪౦ సే | | | | |
| విదరునెయ్యి ,, ,, | ౪౨ | ౦ | ౦ | |
| తెలంగాణా ,, ,, | ౩౯ | ౦ | ౦ | |
| వనస్పతి డబ్బా ౧కి ౧౧ | ౨ | | ౦ | |
| బంగారము తు ౧కి | ౫౦ | ౮ | ౦ | |
| వెండి ౧౦౦ తు | ౭౦ | ౦ | ౦ | |
| తు ౧కి | ౦ | ౧౧ | ౦ | |
| గవర్ ౧కి కల్దారు రూ | ౨౮ | ౮ | ౦ | |
| మారకం | | | | |
| హాలీ కల్దార్లు | ౧౫ | ౧౩ | ౬ | |
| కల్దారుకు హాలీలు | ౧౫ | ౧౧ | ౬ | |
| ఆముదాలు బస్తా | ౧౧ | ౪ | ౦ | |
| వేరుసెనగ | ౮ | ౪ | ౦ | |
| బుడ్డలు పల్లా౧కి | ౮ | ౪ | ౦ | |
| పప్పు పల్లా౧కి | ౧౨ | ౦ | ౦ | |

గమనిక:—

ధరలు వీలైనంతవరకు సరియైనవిగా తెలుపుచుందుము. అయినను ఏమైన పొరపాట్లుండిన దానికి పత్రికవారు బాధ్యులుకాజాలరు. ఈ. నగరాలలో జిల్లాలలో వ్యాపారపు పేటలలోని గొప్పవర్తకులు తమతమకొనాముప్రకటనలు మా పత్రికలో వేసికొనినవారి వ్యాపారానికి మంచిప్రచారము కలుగును.

## భారతదేశ స్థితినిగూర్చి అమెరికాకు మొఱ

ఇదివరలో జరిగిన ఐరోపామహాసంగ్రామములో మన రాష్ట్ర హైకోర్టు ప్రధాన న్యాయమూర్తిగ పనిచేసియుండిన సర్ యస్. సుబ్రహ్మణ్యయ్యరు గారు భారతదేశముయొక్క అస్వాతంత్ర్యస్థితినిగూర్చి అమెరికా అధ్యక్షుడగు విల్సన్ గారికి మొఱ పెట్టినట్లే, ఇపుడు డాక్టర్ టాగూరు, సర్ యస్. రాధాకృష్ణన్ గారలు అమెరికాను భారతదేశస్థితినిగూర్చి శ్రద్ధవహించవలెనని కోరవచ్చునని ఒకమాట కొందరు అనుకొనుచున్నట్లు ఢిల్లీనుండి ప్రకటితముగు "హిందుస్థాన్ టైమ్సు" పత్రికలో వార్త వేయబడినది.

## కాశీవిద్యాపీఠానికి బరోడామహారాజు విరాళము

కాశీవిద్యాపీఠమందు భారతదేశ సంస్కృతి చరిత్రఅనుశాఖను కీ॥ శే॥ బరోడా గైక్వాడ మహారాజా సర్ శాయాజీరావుగారి స్మారకముగ ఏర్పాటుచేయుటకై ఇప్పటి బరోడా మహారాజాగారు ప్రతిఏట రూ౧౫౦౦౦లిచ్చుటకు వాగ్దానము చేసినారు. కాశీవిద్యాపీఠమువారు దానిని అంగీకరించినారు.

## శ్రీశైలములో సప్తాహ మహోత్సవము

మాఘబహుళ ౭ సప్తమి మొదలుకొని చతుర్దశివరకు శ్రీశైలములో సప్తాహ మహోత్సవము మొదలయిన కార్యములు జరుపబడును. ఈ మహాకార్యమునకు ప్రతిసంవత్సరము అనురూపాయలు మొదలుకొని తమకు శక్తి ఉన్నట్లు ద్రవ్యము పంపినవారిని మా సంఘములో సమితి నంబర్లుగా చేర్చుకొని, మాముద్రగలరసీదు పంపగలము. శ్రీశైలమల్లికార్జునస్వామి అభిషేకము చేసిన పవిత్రప్రసాదము ప్రతినెలకు వారి పేరులతో పోష్టుద్వారా పంపించబడును. దీనివిషయమై ఈ క్రింది అడ్రసుకు తెలుపవలెను.

"ప్రెసిడెంటు, శి.శె. బసవయ్యస్వాములవారు, శ్రీశైలం (పోష్టు), ఆత్మకూరు, (జిల్లా) కర్నూలు".

## మరొక ౧౦౦ కోట్ల పౌనుల అప్పు

యుద్ధమునకై బ్రిటిషువారి అవసరము

యుద్ధపుఅవసరాలకై బ్రిటిషుప్రభుత్వమువారు ఇదేఆర్థికసంవత్సరమందు ఇదివరలో ౨౦౦౦౦౦౦౦౦౦ పౌనుల అప్పుచేసియుండిరి. ఇపుడుమరొక ౧౦౦౦౦౦౦౦౦౦ పౌనుల అప్పుచేయనున్నారు. బ్రిటిషుఆర్థికమంత్రి ఈకోరికను పార్లమెంటుకామన్సుసభలో త్వరలో తెలియచేయగలడు.

## ఫ్రాన్సు పరాజయంచే కరాచి వర్తకుల నష్టము

ఫ్రాన్సు జర్మనీతో యుద్ధంలో ఓడినందువల్ల అప్పటికే ఫ్రాన్సుకుచేరి అక్కడనున్న సరకులక్రయము చెల్లించబడనందువల్లను, ఫ్రాన్సుకై కొన్న సరకులవిలువ తగ్గిపోవుటవల్లను కరాచి ప్రత్తివర్తకులకు రూ౫౦౦౦౦౦౦ల నష్టము కల్గినట్లు ఇపుడు తేలినది.

## సత్యాగ్రహవార్తలు

౫ వ పేజి తరువాయి

### పంచాయితీకోర్టు అధ్యక్షుడు

౨౭-౧-౪౧ తేదీన, రేణిగుంట పంచాయతీ కోర్టు ప్రెసిడెంటు శ్రీ వి. వి. రామయ్యశెట్టి సత్యాగ్రహము చేసినందులకు వెంటనే అరెస్టు కాబడిరి. ఫిబ్రవరి ౪వ తేది రిమాండులో నుంచబడిరి. ౪వ తేదిన చంద్రగిరిజాయింటు మేజస్ట్రీటు వీరికి ౩నెలలు కఠినశిక్షయు, రూ. ౫౦/-లు జుర్మానాయును విధించిరి, జుర్మానా చెల్లించని యెడల ఒకనెల శిక్షయనియు తెలిపిరి.

### సత్యాగ్రహుల సంఖ్యలు

ఆంధ్రరాష్ట్రమునందు జనవరి ౨౫వ తేదీతో అంతమయేవారమునందు ౧౭౦ మంది అనుమతి పొందినవారు సత్యాగ్రహంచేసిరి. వారిలో ౧౫౪ మందికి శిక్షలువిధింపబడెను. వారిజుర్మానాల మొత్తం రూ ౧౫౨౬౦. ఉద్యమం ప్రారంభమయినప్పటినుండి ౪౬౭ మంది శిక్షింపబడిరి. జుర్మానాలు ౫౫,౭౫౦ విధి చబడెను. ఆఖరువారమునందు శిక్షింపబడినవారిలో ౧౩౭ మంది సి. క్లాసులో నుంచబడిరి.

తమిళనాడునందు జనవరి ౩౧ వ తేదీనరికి ౭౪౭ సత్యాగ్రహులు జెయిలుకుపోయిరి, రూ ౨౦,౧౯౫ జుర్మానాలు విధించబడెను

### అరెస్టువెంట కేసులేదు

నెల్లూరుపురమున సత్యాగ్రహముచేసిన శ్రీయుత శివపూజ చెంచయ్య, చాట్ల వెంకటచలం శెట్టి, పకీరూరు నరసింహం, శ్రీమతి గడ్డం లక్ష్మమ్మగార్లను నెల్లూరు పోలీసువారు అరెస్టు చేసిరి. నెల్లూరు డిప్యూటీమ్యాజిస్ట్రేటువద్ద ఫిబ్రవరి ౨౭వ తేదిని హాజరుపరచగా మీమీద పోలీసువారు ఛార్జిపెట్టలేదని చెప్పి వదలివేసిరి,

మహమ్మదు ఇబ్రహీంఅను రామ్నాదు జిల్లా కాంగ్రెసుసంఘ కార్యదర్శిని సత్యాగ్రహం చేసినందుకు పోలీసువారు అరెస్టుచేసి నిర్బంధమునందుంచి ౧౫ దినములయినతర్వాత ఫిబ్రవరి ౩వ తేదిన మేజిస్ట్రేటు గారియెదుట హాజరుపెట్టిరి కాని పోలీసులు నేరమారోపించు చార్జిషీటు దాఖలు చేయునందున సబుడివిజనలు మేజస్ట్రేటు ఇబ్రహింసాహెబు గారిని విడుదలచేసిరి. సాహెబుగారు తిరిగి సత్యాగ్రహము చేయ నిశ్చయించిరి.

### ఆంధ్ర సత్యాగ్రహుల మూడవ పట్టిక

ఆంధ్రసత్యాగ్రహుల మూడవలిస్టు మహాత్మాగాంధిగారి అనుమతిపొందివచ్చెను. ఈమూడవలిస్టునందు ౧౫౪ సత్యాగ్రహులు గలరనియు అందు పశ్చిమ కృష్ణాజిల్లావారికి అనుమతిమంది గలరనియు తెలియుచున్నది. ఇంతవరకు ఆంధ్రరాష్ట్రమునుండి ఏడువందల ఒక్కమంది సత్యాగ్రహముచేసిరని తెలియుచున్నది.

## జనాభాను గురించి సందేహ నివారణము

౧౩ జనవరినాటి గోలకొండపత్రికలో నిజాం రాష్ట్రాంధ్రమహాసభాధ్యక్షులైన శ్రీ మం రామచంద్రరావుగారును, అందులోనే శ్రీ వంగపల్లి సీతారామారావుగారును, ౧౯౪౧ సం॥ జనాభానుగురించి ఆర్యసమాజీయులకు విరుద్ధముగా వ్రాయ గలిగినంత వ్రాసిరిగాని ఆటులనే 20జనవరి నాటి గోలకొండ పత్రికలో సంపాదకులుకూడ మిగతా కొరత తీసివేసిరి, ఈవిషయమైనపుడు వారు వ్రేళ్ళ వప్పటికి విషయమెంత్రటి గనుక సంక్షేపముగా వారి కృష్ణపథములను సత్యముపైపునకు మరల్చుటకై యీ అల్పప్రయాస చేయుచున్నాను.

మువ్వురును భాషనాధారముజేసుకొని గోరంతలను కొండంతలుగాజేసిరి, కాని వారు మరల గమనించవలసినది:— "ఆర్యులందరును సహాయకులును, ఆప్తులు శుభచింతకులును. తమ మాతృభాష హిందీయనియు............" సంపాదకులగారి వాక్యానుసారము "ఆర్యసమాజము హిందీతోనే ప్రారంభమై నేటికిని విశేషముగా హిందీలో ప్రచారముకావించుచున్నది." ఇందులో సందేహములేదు. ఆర్యసమాజీయులు తమ నియమానుసారమందరూ పరస్పరప్రేమ సంబంధమును పెంచుకొనుటకై భిన్నభిన్న భాషల మధ్య ఒక హిందీభాషకూ ప్రాధాన్యతనివ్వవలెనంటారు పక్షపాతరహితులైన మహర్షియే గుజరాతి మాతృభాషయైనను, సంస్కృతములో విద్వాంసులైనా చాలాదూర మాలోచించియే "హిందీ"కి ప్రాధాన్యమిచ్చారు, కనుకనే పంజాబులో నేడు హిందీ దినపత్రిక వెలువడునంతటి ప్రాముఖ్యతవహించినది. ఆర్యసమాజికులు కానటువంటి కాంగ్రెసువారందరు హిందీ ప్రచారానికై పెద్దకృషిజేయుచు దక్షిణభారతమున విస్తృతక్షేత్రమేర్పరుచుకొన్నారు. ఒకరు కాకపోయినా వింకొకరైనా ఆకార్యమునుజేయుచునే యున్నారు అది సార్వజనికకార్యము. అది అగదూ

హిందీవారలు ఆంధ్ర కర్ణాటక మహారాష్ట్ర ఆను తేలలు వంచమనుటలేదు, నోటీసు సర్వసాధారణముగా నుండును గాన అటుల వ్రాయవలసియున్నది. కాని తర్వాత "ప్రాంతీయమాతృభాషలుగలవారు తమతమ మాతృభాషతోపాటు గ నన్యభాషయనుచోట తప్పక హిందీయని వ్రాయించగలరని కోరుకొనుచున్నాము," అను వాక్యములనుకలిపి విచారించిన సర్వులసందేహము తీరిపోవును. "మాస్టేటులో నివసించుసోదరులు రాజకీయభాషయగు ఉర్దు వ్రాయచదవలేకపోయినను మాట్లాడగలరు, ఉర్దుకు హిందీయే అనవచ్చును, కాన అన్యభాషయనుచోట తప్పక హిందీ అని వ్రాయించదగును.

మువ్వురుతేఖల మాతృభాషాసేవ ప్రశంసనీయము. కాని యీవిధముగా ఉర్దూయనుచోట హిందీచెప్పుకొనిన మాతృభాషకు యింతవరకు కలుగని నష్టమేముకలుగనున్నదో వివరింతురా? కేవలము మాతృభాషను వంకబెట్టుకొని ఆర్యసమాజముపై దండెత్తవలసిన యవసరమేమి? వారంటే యింతేయులు కెందుకు? స్టేటులో యింత త్యాగం, బలిదానముజేసి ప్రచారమొనర్చి ప్రజలలో నూతనభావములపోసి మేలుకొలుపుచున్నందులకా? స్టేటులో తెలుగునకింత గౌరవము పాది? దానిరూపమెటులున్నది? యని యీ భాషాభక్తులు విచారింది ఆలోపములను రూపుమాపుటకై యత్నించుచున్నారా?

## గ్రంథమాలలవిషయమై అక్రమచర్యలు

గతివారపు గోలకొండపంచికలో దేశోద్ధారక ఆంధ్రకేసరిగ్రంథమాలప్రచురణను అనుచితముగా కొందరు కరోడ్గిరి ఉద్యోగులు స్వాధీనపరచుకొని, అవి నిషేధింపబడినవి కావని తెలిపినను గ్రంథములు తిరిగియివ్వక దయతో రశీదుమాత్రమియిచ్చినటుల ప్రకటితమైనది. పైగ్రంథమాలలవిషయమై తెలిసినప్రతివారికిని పైఉద్యోగులచర్యవలన ఆశ్చర్యముకలుగును. పైగ్రంథమాలల ప్రచురణములుగా వెలువడిన గ్రంథములలో ఏదియు నేటివరకును ప్రభుత్వమువారిచే నిషేధింపబడలేదు, అట్టివి కావుకూడాను, ఒకవేళ ప్రభుత్వదృష్టిలో నిషేధమునకు గురిఅయినచో, ప్రభుత్వము వారు గజెటు ద్వారా ప్రకటింపజేతురు. అట్టిదేదియు జరుగలేదు. అయినచో పైఉద్యోగుల చర్యల కర్థమేమి? యిట్టి చర్యలచే ప్రజలలో అనవసరభీతి కలుగును. మరి యీ గ్రంథమాలలనిర్వహణమునకు కూడా ఆర్థికముగా చిక్కులుకలుగును. అంధకారములో మునిగి ఇప్పుడిప్పుడే ప్రపంచజ్ఞానమునకై పాటుపడు చదువరులను ఆపోహపడి గ్రంథపఠనకై వెలితురు కాబట్టి ప్రభుత్వమువారు ఈసంఘటనవిషయమై విచారణజరిపి, తగినచర్యతీసికొనుటయేగాక, యికమీదట యిట్టివ్యక్తిపరిపాలనాధికారము వృద్ధినొందకుండా చూతురుగాక.

ఇట్లు
వట్టికోట ఆళ్వారుస్వామి.
దేశోద్ధారక గ్రంథమాల, ప్రకాశకుడు.

---

"ఆంధ్రమహాసభాధ్యక్షులవారు చివరకువచ్చేటప్పటికి తమతమకులములు, మతములు, భాషావివరములను యథార్థముగా ప్రశ్నది వ్రస్పష్టముగ వ్రాయించుకొందురనికోరుతాను" అనిఅన్నారు. సీరకంఠంగారును కులమును మతములను ఉన్నదున్నట్లు చెప్పుకోమనిరి. జనాభాలో కులముచెప్పుకొనుటఅనవసరము. కమ్మవారందరు కమ్మవారమని వ్రాయించుకుంటే భూములకాసవములో వారిపేరులేకుండాపోయింది. జనాభాలెక్కల వివరములో వారిపేరేలేదు. హిందువులలోని చీలికలను తెలియజేయుటతప్ప యితరలాభమేమున్నది? అదియునుగాక మద్దుంషుమారిభావాలలో జాతి,తెగ కులము అన్నీ ఒకభావాలోనేయున్నవి. అప్పుడు జాతియంటే హిందువనిచెప్పుకుంటారా? ఇకకులమెక్కడచెప్పుకుంటారు? ఏమిటీసలహాలు!

కనుక సత్యముకోరినచో ఆర్యసమాజికులుచెప్పుచున్నటుల జాతి-ఆర్యజాతియని చెప్పండి. లేదా మేమార్యజాతివారముకాము మేమార్యులముగాము అనిఒకమారు ప్రకటనజేయండి చూద్దాము. మతములెన్నివిధములని తలచుచున్నారు? అవన్ని వైదికములంటారా? అవైదికములంటారా? వైదికములైతే మతముఅన్నచోట వేదమతమనిచెప్పుకొనుచో ఎవరిమునిగిపోవుచున్నది? ఇంకాదేశము నడుగంట జేసిన మతభేదము లుండవలెననియేనా మీసలహాలు అహా! మీదేశభక్తికిధన్యవాదములు.

ఇప్పుడుఫారాలలో నాల్గవఖానాలో ధర్మము లేకమతము అనియుండును. సమస్తహిందువులు వేదమునుఒప్పుకొనెదరుగాన వేదధర్మము అని వ్రాయించుడనిసమాజం కోరుచున్నది. మూడవఖానాలో "నసల్ కబీలా జాతి"యనియుంటుంది. భారతీయులందరు ఆర్యులుగాన ఆర్యసంతానముగాన "ఆర్యజాతియనిచెప్పుడని ఆర్యసామాజము బోధించుచున్నది. భాషావిషయ మిదివరకే తెల్పియుంటిని.

ఇట్లుని ధేయుడు
బండి వేంకటరంగారెడ్డి
ఖమ్మంమెట్టు

## మర్దుంషుమారి- యాదవులకు సూచన

హిమాలయపర్వతము మొదలు కన్యాకుమారి వరకును భారతఖండమున యాదవులులేని చోటు ఎచటనులేదు. మలయా, సింహళము, రంగూన్, బర్మా,పినాంగు, మున్నగుప్రదేశములలోను యాదవులున్నారు. కాని యాదవులేబిరుదముతో నున్నారని తెలియుట బహుఅసాధ్యము, దక్షిణదేశములోనియాదవులు, పిళ్ళ,కోనార్ నంబియార్, దాసు, కరయాలరు,రెడ్డి,చెట్టి, నాయకర్,సేర్వై గౌండర్, నాయుడుఅనుబిరుదముల, ఉత్తరదేశములోనియాదవులు గోపు, సద్గోప్, ఘోసీ, వర్మ,ప్రసాదు,మండల్, దళయా, రవత్,అను అనేకబిరుదములతోను, ప్రవర్తించుటవలన, యాదవులను తెలుసుకొనుట చాలదుర్లభము. అందుచేతనే, యాదవుల నేకీభవించుట సాధ్యముకాకపోయినది. వారివారిప్రాంతములననుసరించి ఆప్రాంతములలో వాడబడు బిరుదములను దేశభాషలవలంబించి మెలంగుచున్నారు. కావున గతవ సంవత్సరము డిసంబరుమాసము కలకత్తాలో జరిగిన అఖిలభారతయాదవమహాసభలో యాదవజాతికిచెందినవారందరు తమచిరునామాలచివర 'యాదవ'అనుపదమును చేర్చుకొనవలెనని తీర్మానించడమైనది. ఇంతియగాక, రాబోవుజనాభా ఎన్నికలలో, యాదవజాతికిచెందినవారందరును, యాదవులనిఅనిపించుకోవలెనని యీ పత్రికద్వారా హెచ్చరిక చేయుచున్నాము. అట్లుచేయుటవలన కులములోనిజనసంఖ్య అపరిమితముగా హెచ్చగును. భారతదేశములోని యాదవులసంఖ్య సుమారు రెండున్నరకోట్లని కొందరను కొనుచున్నారు, కాని. అంతకురెండింతలు అధికముగానుండవలెననిమా యభిప్రాయము. వివిధబిరుదములతో యాదవులు మెలంగుటవలనయాదవనాయుళ్ళను, బలిజనాయుళ్ళకులములోను, యాదవగౌండ్లను,గౌండ్లకులములోను ఇట్లుపలువిధములుగా ౧౯౩౧సం. జనాభాలెక్కలలో తీయబడినందున, యాదవుల జనసంఖ్య లెస్సయైనదని మాదృఢనమ్మకము.ఇంతియగాక తమచిరునామాలకు 'యాదవ'అనుపదమును చేర్చించుకొనుటకును, చరిత్రశ్రేష్ఠమైన యాదవకులమునబుట్టియు, యాదవు లనుపించుకొనుటకును, సిగ్గుపడువారు కొందరున్నారు. మరియు "యాదవ"అనుపదమును చిరునామాలచివర వాడుటవలన, యాదవులలో ఐక్యత యేర్పడగలదని నిస్సందేహముగా నిరూపించగలము. కాన రాబోవుజనాభాఎన్నికలతో శ్రీ నిజాంప్రాంతములో యాదవకులమునకు చెందినవారందరును, యాదవులనిపించుకొనుట అత్యంతావశ్యకమని, మరొకమారు హెచ్చరిక చేయుచున్నాము.

ఈవిషయములనన్నింటిని మనలో చదువుకొనినసరసులందరు గ్రహించుటయేగాక, వారు తమ చుట్టుంగల యితరఅమాయిక కులసోదరులకెల్లరకు చక్కగా చదివివినిపించి వారిమనసులకు బట్టునట్లు ప్రబోధించుట ముఖ్యకర్తవ్యమని హెచ్చరిక చేయుచున్నాము.

ఇట్లు
కంటె. బాబురావు యాదవ
యిసామియాబజారు హైద్రాబాదు (దక్కన్)

# గలెటీగారి సత్యాగ్రహుల విచారణ

## సత్యాగ్రహుల అర్హతలనుగూర్చి విమర్శచేయుట

బ్రిటిషువారికి యుద్ధమునసహాయము చేయకూడదని కేకలువేయుట నేరముకాదని యిదివరకు కొంతమంది సత్యాగ్రహులను విడుదలచేసిన గూడూరు జాయింటు మేజస్ట్రేటు ఆర్. గలెటీ ఐ-సి-ఎస్-గారిసమక్షములో జనవరి ౨౨వ తేదిన మరల నెల్లూరు సత్యాగ్రహుల కేసువిచారణజరిగెను. పి-వి-రాఘవరెడ్డి, మాదాసు వేంకటస్వామి, ఏ, సుబ్బరామిరెడ్డి, జొన్నా సుబ్బయ్య, కే, వెంకటరమణరెడ్డి, కే. లక్ష్మీనారాయణరావు (బి, ఏ, బి ఎల్.) గార్లు నెల్లూరు జిల్లా మేజస్ట్రేటు ఎం. కరంతుల్లాగారి ఆజ్ఞపై గూడూరు జాయంటు మేజస్ట్రేటుకోర్టుకు క్షేపంపబడిరి. గలెటీగారు పొదలకూరులో వున్నందున వారును గూడూరునుంచి బస్సులో పొదలకూరుతీసుకొనిపోయిరి. ౨౫వ తేది సాయంకాలం వెంకటగిరిలో సత్యాగ్రహముచేసిన ఎం. తిరువేంగడం నాయుడుగారినికూడ పొదలకూరు తీసుకొనిపోయిరి.

### మొదటి కేసు

అడ్వకేటు లక్ష్మీనారాయణరావుగారి కేసును గలెటీగారు మొదటవిచారణచేసిరి, "జనవరి ౨౨వ తేదిన వెంకటగిరిలో ఒకసభలోఆయన యుద్ధములో సహాయముచేయగూడదని కేకలువేసినట్లును అప్పుడక్కడ విద్యార్థులు, చేతపనివారు కార్మికులు మొదలైనవారు ౧౦౦౦ మందివుండినట్లును పోలీసు సబుయినస్పెక్టరు పి, వేదాజీమనుగారు కోర్టులోచెప్పిరి, నిందుతుని కేకలు వినుటవల్లవారిఅభిప్రాయాలుమారిన సూచనలు నాకుకనబడలేదు."

"సాక్షిని ప్రశ్నలడిగెదరా?" అనిమేజస్ట్రేటుఅడుగగా నిందితుడు ప్రశ్నలనడుగనని చెప్పెను.

మేజి:—మీరుమనఃపూర్వకముగా కాంగ్రెసుసేవచేయుచున్నారా? మీరుచేసే ప్రజాసేవవల్ల ప్రజలలో మీకుకొంతపలుకుబడి కలిగినదా?

నింది:—నేను ఏదోకొంచెము దేశసేవచేయుచున్నాను. అందువల్లనాకు కొంతపలుకుబడి కలిగినది,

మేజి:—దేశరక్షణ నియమావళిలోని ౩౮వ సెక్షనుప్రకారము ద్వీపాంతరవాసశిక్షను కూడావేయవచ్చును. ఈయుద్ధంలో భారతీయులుప్రభుత్వమువారికిసహాయముచేయకపోవుట జర్మనులకు ఇటలీవారికి సహాయముచేయుటయే అగునని తెలుసుకొనిమీరు ఆరెండుదేశాలకుసహాయముచేయుటకొరకే సభలోయుద్ధమునకు ప్రతికూలముగా కేకలువేసినారా? జర్మనీ ఇటలీదేశాలతో బ్రిటిషుప్రభుత్వమువారిప్పుడు చేయుచున్నారని మీకు తెలిసేవున్నదికాదా?

నింది:—బ్రిటిషుదేశమునకు శత్రువులైన జర్మనీ ఇటలీదేశాలవారికి సహాయముచేయవలెనన్న ఉద్దేశ్యం నాకెంతమాత్రములేదు. కాంగ్రెసువారన్నడూ అట్లుచేయరు.

మేజి:—బ్రిటనుతో యుద్ధముచేయుచున్న దేశాలకుసహాయముచేసే వుద్దేశ్యములోనే మీరుకేకలువేసిరన్న అభిప్రాయము సాక్ష్యమువల్ల మేజిస్ట్రేటుకు కలిగినచో మీకుమిక్కిలిగొప్పశిక్ష విధించుట కవకాశమువున్నదని మీకుతెలుసునా?

నింది:—నాకు వేయుశిక్షకు నేనుభయపడను-మీరీకేసును సెషన్సుకోర్టుకు పంపించవచ్చును-వారేయీకేసు విచారణచేసెదరు.

"రేపు గూడూరులో యీకేసును నేను విచారణచేసెదను"అని మేజస్ట్రేటుచెప్పెను.

### జొన్నా సుబ్బయ్యగారి కేసు

తరువాత జొన్నా సుబ్బయ్యగారి కేసువిచారణజరిగెను. సుబ్బయ్యగారిని యీనెల ౨౦వ తేదీని చెన్నూరులో అరెస్టుచేసిరి. చెన్నూరులో ౫౦౦ మందిగలసభలో మూడ్రాయి యుద్ధప్రతికూలకేకలనువేసెనని అరెస్టుచేసిన పోలీసు సబ్ యినస్పెక్టరు సాక్ష్యములోచెప్పెను

మేజి:—మీరు యితరుల ఆజ్ఞప్రకారము సత్యాగ్రహముచేసినారా?

నింది:—అవును నేనుఆంధ్రరాష్ట్రకాంగ్రెసు సంఘమువారి ఆజ్ఞప్రకారము సత్యాగ్రహముచేసినాను. నేనుసత్యాగ్రహముచేయుటకు వారుఅనుమతినిచ్చినారు-

మేజి:—మీరుయుద్ధమునకు యెందుకుప్రతికూలురుగావున్నారు.

నింది:—కాంగ్రెసువారుపూర్తిగాఅహింసానిరతులుగనుక దౌర్జన్యప్రధానమైన యుద్ధాలకు కాంగ్రెసువారు ప్రతికూలురు, నేనుకాంగ్రెసువాదినిగనుక యీయుద్ధానికి ప్రతికూలుడను.

అంతమేజస్ట్రేటు ఇట్లుచెప్పెను-

"కాంగ్రెసువారికి అహింసయందు నిష్కపటమైన నమ్మకముయెన్నడునులేదు, వారుఢిల్లీ ఒడంబడికనుగురించియు, పూనా ఒడంబడికనుగురించియు, మాట్లాడుదురు-

బ్రిటిషుప్రభుత్వము యిండియాకు స్వరాజ్యమిచ్చినట్లయిన కాంగ్రెసువారును వారిసలహాప్రకారము దేశీయులందరును యుద్ధములో సర్వవిధములసహాయముచేకూర్చెదరని యిదివరకు కాంగ్రెసు మహాసభాధ్యక్షుడు మౌలానా అబుల్‌కలాం ఆజాదుగారును కాంగ్రెసుప్రధాననాయకులు పెక్కుమందియుచెప్పిరి. అహింసానిరతులముగనుక అహింసతో ఈయుద్ధమును ప్రతిఘటింతుము. కాంగ్రెసువారిప్పుడనుచున్నారు ఇదినిష్కపట్యముకాదు వెనుకచెప్పినమాటలకు యిప్పుడనుమాటలు విరుద్ధముగా వున్నవి. అమాయకులైనప్రజలను కాంగ్రెసువారు కళవరుమకొని స్వాభిప్రాయాలకు విరుద్ధముగా సత్యాగ్రహకేకలువేసి చెరసాలలకు వెళ్ళవలెనని కాంగ్రెసువారు వారికి ఆజ్ఞాపించుచున్నారు సత్యాగ్రహముచేసేవారు వివేకమునువుపయోగించకుండాఅంధప్రాయముగా సత్యాగ్రహముచేయుచున్నారు. సత్యాగ్రహముచేయవలెనన్న వుద్దేశ్యమువీరికిలేదు దీనినిగురించివీరికేమిగాని తెలియదు.

వీరికిదేశములో లేశమైనపలుకుబడిలేదు కనుక వీరు సత్యాగ్రహముచేసి జేలుకు వెళ్ళుటవల్ల యితరులు వీరిపద్ధతిననుసరించరు. కాబట్టి యిటువంటిఅమాయకులచేత సత్యాగ్రహం చేయించుటను నేనుఒప్పుకొనను వీరు గొర్రెలమందవంటివారు ఈనిందితుడుకూడా అట్టివాడే. కాంగ్రెసుపార్టీవారందరు ఒకరినొకరుపొగడుకొనుట ప్రారంభించినారు కాంగ్రెసు నాయకులు కాంగ్రెసుపార్టీతోసంబంధంలేని వారిఅభిప్రాయము లెట్లున్నది తెలుసుకోరు ఈనిందితుడు చేసిననేరము ప్రమాదకరమైనదికాదు. ఇతడు రేపు గూడూరులో కోర్టుకువచ్చి ఒక బాండు నియ్యాలెను."

తాను బాండునీయనని నిందితుడుచెప్పెను పోలీసు వారతనిని చెరసాలకు తీసుకొనిపోయిరి.

### తిరువేంగడం నాయుడు గారి విచారణ

"వెంకటగిరిలో విద్యార్థులసభలో ఈయన సత్యాగ్రహముచేసినాడు, ఈయన కాంగ్రెసు ప్రమాణపత్రముమీద సంతకముచేసినవాడు. ఈయన సత్యాగ్రహముచేయుటకు ఆంధ్రరాష్ట్ర కాంగ్రెసుసంఘమువారనుమతినిచ్చిరని నేను విన్నాను. ఆ అనుమతిపత్రమును నేను చూడలేదు. నేనుదానికొరకువెతికితినిగాని నాకదికనబడలేదు. ఈతడు యిదివరకెన్నడును యేసభలోఉపన్యసించియుండలేదు. యుద్ధము ప్రారంభమైన తరువాత నిన్ననే మొదటిసారి సభలో మాట్లాడినాడు." అని తిరువేంగడంనాయుడుగారిని అరెస్టుచేసిన వెంకటగిరి సర్కిలుయినస్పెక్టరు కోర్టులో సాక్ష్యమిచ్చిరి. మేజిస్ట్రేటు నిందితునియీరీతిగాకొన్నిప్రశ్నలడిగెను.

మేజి:—అధికారముగల సత్యాగ్రహి అనుపదం యేభాషానుండైనా వున్నదా? మీరీజట్టుకుచెందినవారేనా?

నింది:—నేనుసత్యాగ్రహంచేయుటకు నాకు ఆంధ్రరాష్ట్రీయకాంగ్రెసుసంఘమువారు, మండలకాంగ్రెసుసంఘముద్వారా అనుమతినిచ్చినారు గనుక నేను అధికారం పొందిన సత్యాగ్రహినే.

మేజి:—మీరునిర్ణీతమైన కేకలనుమాత్రమే వేసినారా, లేక మీస్వంతఅభిప్రాయాలను వెల్లడించినారా?

నింది:—నేను యుద్ధప్రతికూలకేకలను మాత్రమే వేసినాను.

మేజి:—భారతదేశీయులు యీ యుద్ధంలో ప్రభుత్వమునకు సహాయముచేయగూడదని గాంధిగారున్నూ యితర కాంగ్రెసునాయకులును అనేకసారులు పత్రికలలోప్రకటించియున్నారు. సభలలోప్రకటించివున్నారు. మరల మీరంటిసత్యాగ్రహులు యిట్టికేకలనువేయుట యెందుకు? ఇది అవసరమా? ఈకేకలుపాతబడిపోయినవి- మీరిప్పుడీకేకలనువేయుటవల్లను, యిదివరకు నాయకులు చేసినఉపన్యాసాలవల్లను వ్రాసినవ్యాసాలవల్లను ప్రజలఅభిప్రాయములలో కలిగిన ఫలితముకంటె యెక్కువఫలితముకలుగునని భావించునంతటి దురభిమానము మీకేమైనవున్నదా?

నింది:—అటువంటి దురభిమానము నాకులేదు.

మేజి:—ఇటువంటికేకలువేయుట యుద్ధప్రతికూలకార్యమే అని న్యాయాధిపతి నిర్ణయించినచో యిట్టికేకలువేయుటకై బోధించినవారును, యీసభలయేర్పాటుచేసినవారునుకూడా యీకేకలను వేసినవారని పరిగణింపబడుదురు, అప్పుడు వారుకూడ శిక్షార్హులగుదురు- ఈకేసులోకూడ రేపుగూడూరులో తీర్పుచెప్పబడును.

ఇప్పుడు యిండియాలో కాంగ్రెసుఉద్యమము సరియైనపద్ధతులమీద జరుగుటలేదు- కాంగ్రెసువారు ౧౮౮౫నుంచి స్వరాజ్యముకై తీవ్రముగాపనిచేయుచున్నారు- వారుసరియైనరీతిని పనిచేసియున్నచో ౧౦ యేండ్లలోనే అనగా ౧౮౯౫ లోనే ఇండియాకు స్వరాజ్యము వచ్చియుండును- ౧౯౩౫ వ సం॥ము ఇండియా రాజ్యాంగశాసనము అసంతృప్తికరముగా వున్నదని కాంగ్రెసువారనుచున్నారు- దీనికివారే బాధ్యులు. వారిఅర్హతను తగినసంస్కరణలే యీచట్టమువల్ల వారికిలభించినవి ఒకదేశానికి స్వాతంత్ర్యము రావలెనన్నచో నాయకులు లోకజ్ఞానము కలవారుగావుండవలెను. ఇప్పుడు ఇండియాలో రాజకీయనాయకులుగావున్న వారికి లోకజ్ఞానము (కామన్సెన్సు) పూజ్యము వీరు నన్నడిగినచో పాంథిక అర్థకాలములోపనిచేయుటకుపయోగకరమైన సూచనలను నేనుచెప్పెదను.

తర్వాత తినడివిజనులో సత్యాగ్రహముకేసులలో తీర్పుచెప్పటనుగురించి జిల్లామేజస్ట్రేటుతో ఆలోచించుటకు గలెటీగారు నెల్లూరుకుపోయిరి

నిందితులనందరిని సాయంకాలం పొదలకూరునుంచి గూడూరుతీసుకొనిపోయిరి.

### తీర్పులు

౨౫ వ తేదీన మరలగలెటీగారి, విచారణక్రిందికి తీసుకొనిరాబడిన సత్యాగ్రహులు తీసుకరాబడిరి. వారు మధ్యాహ్నము ౧౪ గంటలకువచ్చి కేసు ౨౪ గంటలకు ఆరంభముచేసిరి.

చెన్నూరుగ్రామములో సత్యాగ్రహముచేసిన జొన్నా సుబ్బయ్యగారిని విచారించికోర్టు లేచునంతవరకు శిక్షయును, జుర్మానా రూ ౨౫౦లు ను అడకట్టనిపక్షమున ౧ నెలకఠినశిక్షయువేసిరి

వెంకటగిరిలో సత్యాగ్రహి తిరువెంగడం నాయుడుగారిని విచారించి పొవలాజున్మానావిధించిరి. వారు నేను కట్టజాలననగా అట్లయిన నేనే కట్టుకొందునని గలెటీగారు వారిని విడిచిపెట్టిరి.

మనుబూరుసత్యాగ్రహి వెంకటరమణారెడ్డిగారిని వదలివేయుచు నీవునిజమైనసత్యాగ్రహివైన రైలుగాని, బస్సుకానిఎక్కకుండ పాదచారివై సత్యాగ్రహముచేయుచు ఢిల్లీకిపోదుకదా మీ గ్రామము వరకు పోకలయునని చెప్పిపెట్టిరి.

గూడూరు సత్యాగ్రహి అవపల్లిసుబ్బరామరెడ్డిగారిని కొన్నిప్రశ్నలువేసి తర్వాత కోర్టులేచునంతవరకు శిక్షయును, రు ౧౦౦ జుర్మానా యువిధించిరి. రెడ్డిగారు నేనుకట్టననిరి. ఆవేయిరూపాయలు నీజీవితములో ఎప్పుడైనను వసూలగునట్లు చేసెదననిరి. సాధ్యమైనంతవరకు త్వరలో వసూలుచేసెదననిరి

సుళ్ళూరుపేటసత్యాగ్రహి మాదాసు వెంకటస్వామి నాయుడు గారిని కొన్నిప్రశ్నలువేసిరి. కాని నాయుడుగారు మీయిష్టమువచ్చినట్లు వ్రాసుకొనవచ్చుననిరి, అంతట గలెటీగారు వారిని వదలివేసినామని చెప్పిరి.

## యూరపియులకై భారతదేశంలో తగిన వసతులు

### ప్రభుత్వాధికారుల ప్రయత్నాలు

యుద్ధకారణంవల్ల లేచివచ్చుచున్న బ్రిటిషుప్రజలకును, ఇతర యూరపీయ ప్రజలకును వదలివేయబడియున్న తమ నివాసస్థలములలో కొన్నిటిని నివాసమునకై యివ్వవలసినదని బెంగాలురాష్ట్రంలో బారాసెట్ సబ్ డివిజనల్ ఆఫీసరు అక్కడిజనులకు విజ్ఞప్తి చేసినాడు. బెంగాలుప్రభుత్వమువారు ఇట్టిఏర్పాటులుచూడవలసినదని యుద్ధసంఘమువారికి తెలుపగా యుద్ధసంఘమువారు ఇట్టి విజ్ఞప్తులను బెంగాలురాష్ట్రమందంతటను భూస్వాములకును, హోటళ్ళ యజమానులకును చేసినారు. యుద్ధం జరుగునంతకాలం యూరపీయులకు తగినవసతులకై అధికారులు శ్రమపడుచున్నారు.

సుళ్ళూరుపేటనుండి మరలయాగంటిరామలింగంగారు సత్యాగ్రహముచేసి అరెస్టు అయినచ్చిరి. వీరినిలోగడ ౩ వతారీఖున గలెటీగారు వదలివేసియుండిరి. వీరినిఈసారి విచారించకయే మరలవదలివేసిరి పోలీసువారితో వీరినేల మరల అరెస్టుచేసితిరనిరి,

వెంకటగిరిసత్యాగ్రహి క. నారాయణరావు, (బి-ఎ-బిఎల్) గారిని, శ్రీపొన్నలూరు వీరరాఘవరెడ్డి మున్నగువారలను మనువాడునిచారించెదమనిరి. తెలకొలనిజనులు ఆఫీసువద్ద మూగియుండిరి.

# కాంగ్రెసు సత్యాగ్రహము

## బెంగాలు రాష్ట్రము

కలకత్తాలో పలుచోట్లయుద్ధవ్యతిరేక కేకలు వేసి సత్యాగ్రహంచేసిన శ్రీసరిదేవి, ఉమాశంకర శాస్త్రి, రాజానారాయణలాల్ అనుముగ్గురు సత్యాగ్రహులు అరెస్టు చేయబడలేదు. బర్ద్వాన్ జిల్లా ప్రథమసత్యాగ్రహి శ్రీ విజాయి భట్టాచార్యగారు జిల్లాలో పలుచోట్లమూడురోజులు సత్యాగ్రహంచేసినను పోలీసులు పట్టుకోలేదు.

బెంగాలులో జనవరి మాసమున ౫౦ మంది సత్యాగ్రహులు రాష్ట్రంపలుస్థలములందు అరెస్టు చేయబడిరి. వారిలో ౭గురు స్త్రీలు, ఒకడు ముస్లిము అనేకులునిమ్నజాతులవారు.

## బీహారు రాష్ట్రము

సత్యాగ్రహోద్యమం రెండోదశలో బీహారు రాష్ట్రమునయిప్పటికి ౪౦ మంది సత్యాగ్రహులు అరెస్టుచేయబడిరి. డా. రాజేంద్రప్రసాదుగారు సత్యాగ్రహం మూడోదశలోపాల్గొను సత్యాగ్రహంపట్టికను పరీక్షించి సత్యాగ్రహులకుక్రొత్తపలకాలు తెలుపగలరని తెలియుచున్నది. ఖాజాయినయతుల్లాగారు సత్యాగ్రహమొనర్పినందుకు గయలో అరెస్టుచేయబడిరి.

## సరిహద్దు రాష్ట్రములో అరెస్టులులేవు

సరిహద్దురాష్ట్రంలో మాజీవిద్యామంత్రి ఖాజీ అతాఉల్లాగారితోసహా ౭గురు సత్యాగ్రహులు ఫిబ్రవరి ౩వతేదిన సత్యాగ్రహంచేసిరి వారుఅరెస్టుకాలేదు.

## గుజరాతులో సత్యాగ్రహం

గుజరాతులో జనవరి ౧౫ నుండి ౩౧వతేదీవరకు మొత్తంమీద ౧౭౭ సత్యాగ్రహులు అరెస్టు అయిరి. వీరిలో ౧౧౦ మందికి శిక్షలువిధింపబడెను ౧౭ మంది విచారణకై వేచియున్నారు సత్యాగ్రహోద్యమం ప్రారంభంనాటినుండి మొత్తం అరెస్టులు ౨౧౭:

## లక్నో కాంగ్రెసు అధ్యక్షుడు

శ్రీదయాకృష్ణ కంజారుగారు లక్నో నగరకాంగ్రెసు కమిటీ తాత్కాలిక అధ్యక్షుడు ఫిబ్రవరి ౨వతేది అరెస్టుచేయబడిరి.

కాశీ కాంగ్రెసు తాత్కాలిక కార్యదర్శి శ్రీ సత్యనారాయణ శర్మగారు అరెస్టుచేయబడిరి.

## మొహారంలో సత్యాగ్రహం అపుదల

మొహరముసకు గాను పంజాబులో సెయిల్‌కోటు, ముల్తాన్, లూధియానా, జలంధర్ జిల్లాలందు సత్యాగ్రహం తాత్కాలికంగా ఆపివేయబడెను.

## కలకత్తాలో అరెస్టులేదు

శ్రీయుతులు ఉమాశంకరశాస్త్రి కామనాథ్ సింగు రామచల్ ఉపాధ్యాయ, శివహరి సగరేరియాగార్లు కలకత్తానగరంలో ఫిబ్రవరి ౫వతేది పలుస్థలములందు సత్యాగ్రహంచేసిరి, ఎవరూఅరెస్టుకాలేదు.

అఖిలభారత ట్రేడుయూనియను కాంగ్రెసు కమిటి అధ్యక్షుడు డా. సురేశచంద్రదెవర్జి యం యల్. ఏ. గారు చిత్రగంజాలో సత్యాగ్రహంచేయగా పోలీసులు అరెస్టుచేసి కలకత్తాకు పిలుచుకొనివచ్చిరి.

## చెన్నూరులో అరెస్టుచేయలేదు.

చెన్నూరులో ౪—౨—౪౧ది ఉ॥ ౧౧గంటలకు శ్రీ సి. శేషయ్యగారు సత్యాగ్రహముచేయగ, పోలీసువారుండియు, అరెస్టుచేయలేదు. తర్వాత యీసత్యాగ్రహి యుద్ధవ్యతిరేక కేకలువేయుచు, సాయంకాలానికి మసుబోలు చేరుకొనిరి.

## సరిహద్దురాష్ట్ర సత్యాగ్రహము

సరిహద్దురాష్ట్రంలో డా॥ ఖాన్ సాహెబు అబ్దుల్ ఖయూంగార్లు పెషావరుజిల్లాలో గర్హిహమిద్, హరియానా, గులాబాద్, అలిజ, చర్సద్దయిజా అనేగ్రామాలందు తిరిగిసత్యాగ్రహ మొనరించిరి— ఈస్థలాలలో వారు ప్రసంగాలు ఒనగినమీదట పెషావరుకు తిరిగివచ్చిరి— సరిహద్దు రాష్ట్ర ముస్లింలీగుసభ్యుడైన అబ్దుల్ రషీదు గారు కూడా, డా॥ ఖాన్ సాహెబు అబ్దుల్ ఖయూం గార్లుసాగించిన ౧౨మైళ్ళ సత్యాగ్రహ యాత్రలో వెంటనుండిరి సరిహద్దుసత్యాగ్రహంగూర్చి ఖాన్ అబ్దుల్ గఫార్ ఖాన్ గారు మహాత్మా గాంధిగారికి లేఖవ్రాసియున్నట్లును, మహాత్ముని ఆదేశములకు వారునిరీక్షించుచున్నట్లును తెలియుచున్నది.

సంయుక్తరాష్ట్రములో ఘాజీపూరునందు ఫిబ్రవరి ౧వ తేదివాడుసత్యాగ్రహంచేసిన శ్రీ విశ్వనాథ్ సింగు గౌతంగారిని అరెస్టు చేయలేదు— మీరట్ జిల్లాకాంగ్రెసుఅధ్యక్షుడు శ్రీ కేదారనాథ్ భార్గవాగారికి ౨ సం॥ కఠిన శిక్ష రూ ౨౦౦ జుర్మానావిధింపబడెను— శ్రీమతిశాంతిదేవిగారికి కోర్టుముగిసేవరకు శిక్ష రూ ౨౦ జుర్మానా, దానిచెల్లించనియెడల మూడునెల శిక్షవిధింపబడెను.

బొంబాయిలో హిలాల్ పత్రికసహాయసంపాదకుడు శ్రీవజీరుద్దీన్ అబ్బాస్ గారు, "యఫ్" వార్డు కాంగ్రెసుకమిటీఅధ్యక్షుడు శ్రీ డి.డి.వాడియాగార్లు ఫిబ్రవరి ౩వతేది సత్యాగ్రహము చేయువలెనియుండగా, ముందుగనే అరెస్టు చేయబడిరి.

## పూర్వపు పబ్లిక్ ప్రాసిక్యూటరు సత్యాగ్రహము

అనంతపురమందు ఇదివరలో పబ్లిక్ ప్రాసిక్యూటరుగాను, గవర్నమెంటుప్లీడరుగా నుండిన కె. యస్. రాఘవాచారిగారు ఫిబ్రవరి ౧వ తేది సత్యాగ్రహంచేయగా అరెస్టుచేసిరి. ౩వతేదిని సబ్ డివిజనలు మేజిస్ట్రేటు వారికిఒక సం॥ము కఠినశిక్షవిధించిరి. ఆచార్యులుగారు గవర్నమెంటుప్లీడరుగారు, పబ్లిక్ప్రాసిక్యూటరుగాను రెండువారముల క్రిందటివరకూ పనిచేయుచుండిరి— వీరు నాలుగైదుసంవత్సరములు జిల్లాకాంగ్రెసు అధ్యక్షులుగనుండిరి— మొదటినుండియు జిల్లాహరిజనసేవక సంఘాధ్యక్షులుగా నున్నారు— వీరు గాంధి గారిఅనుజ్ఞబడసి ఫిబ్రవరిఒకటవతేదిసత్యాగ్రహమొనర్తునని కలెక్టరుగారికితెలియజేసిరి—

## తాలూకా కాంగ్రెసు కార్యదర్శికి శిక్ష

జనవరి ౨౮ నాడు తుమ్మలగ్రామమున సత్యాగ్రహమొనర్చిన తాలూకాకాంగ్రెసుసంఘ కార్యదర్శి శ్రీబూరుగుల నాగభూషణం గారికి అనంతపురము డివిజనల్ మేజిస్ట్రేటు ౪నెలల కఠినశిక్షను విధించిరి.

## అరెస్టుచేయబడని.సత్యాగ్రహులు

తెనాలితాలూకా రావికంపాటిగ్రామంలో ౩౧—౧—౪౧ వతేదీపగయు ౧౦ గంటలకు శ్రీ కొసరజేని అంజయ్యగారును, తెనాలితాలూకా యడ్లపల్లిగ్రామంలో ౧—౨—౪౧ వతేదిన జనాబ్ ముస్తాఫా సాహెబుగారును, తెనాలితాలూకా అనంతవరంగ్రామంలో ౧—౨—౪౧ వతేదిన శ్రీ నాగళ్ళధనాశంకరరావుగారును, తెనాలితాలూకా మోపర్రుగ్రామవాస్తవ్యులు శ్రీకల్లూరికృష్ణయ్యగారు నాసువగుంటపాలెంలో యుద్ధప్రతికూలవాక్యములుబల్కుచు సత్యాగ్రహము గావించిరి, పైవారినిపోలీసువారు అరెస్టుచేయలేదు. పైవారుముగ్గురును తెనాలి తాలూకాలో అన్నిగ్రామములుదిరిగి యుద్ధప్రతికూలములగు కేకలువేయుచున్నారు. గాని అరెస్టులులేవు.ముఖ్యుల సత్యాగ్రహులను అరెస్టు గావింతురనియు మిగిలినవారిని అరెస్టు గావింపరనియు తెలియుచున్నది.

## సత్యాగ్రహుల జుర్మానాల వసూలు

తెనాలితాలూకాలో అమృతలూరు గ్రామంలో సత్యాగ్రహము గావించి శిక్షింపబడిన శ్రీవెలువోలు సీతారామయ్యగారికివిధించిన ౩౦౦ రూపాయలను, పెదరావూరు గ్రామంలో సత్యాగ్రహము గావించి శిక్షింపబడిన శ్రీశరణు రామస్వామిచౌదరిగారికి విధించిన ౨౦౦రూపాయలు ను పెదపాలెంగ్రామంలో సత్యాగ్రహము గావించి శిక్షింపబడిన శ్రీపుతుంబాక శ్రీరాములుగారికివిధించిన ౨౦౦రూపాయలును తెనాలితాలూకాపోలీసువారు వసూలుచేసిరని తెలియుచున్నది.

## జాఅణాల జుర్మానాకై కలంవేలము

చిత్తూరులో కార్మికుడగు శ్రీ ఎ.కె.జగన్నాథప్రసాదు గారు ౩౧—౧—౪౧తేది ప్రొద్దున చిత్తూరుకుచేరిన గ్రీమ్సుపేటలో యుద్ధప్రతికూలకేకలు వేసినందున ఇతనిని అరెస్టుచేసిరి.

కోర్టువారడిగినప్రశ్నలకు అతడు తానుకోర్టువారు ఆణాలవంతునసంపాదించుకొనువాడననియు, దరిద్రతలోనున్న హిందూదేశము యుద్ధములో పాల్గొనుటకు వీలుపడదనియు చెప్పెను.

మేజిస్ట్రేటుగారు అతనికి కోర్టులేచువరకు శిక్షను, నాఅణాలుజుర్మానాను విధించిరి. జుర్మానా నరోబట్టుటకై సత్యాగ్రహివద్దయుండిన కలము నుతీసి వేలమువేయగా ౧౦అణాలకు గైకొనబడెను. ఇందుకోర్టుకుచేరవలసిన నాఅణాలుపోను మిగిలిన ౬అణాలను నిందితునికి వాపసు యిచ్చిరి.

## సత్యాగ్రహికి మూడేండ్ల శిక్ష

ఫిబ్రవరి౧వతేది సత్యాగ్రహంచేసిన డిల్లీవాసి స్వామి బసంతనాథ్ గారికి మూడేండ్లకఠిన శిక్ష విధింపబడెను.

## జీలంజిల్లా కాంగ్రెసు అధ్యక్షుని అరెస్టు

జీలంజిల్లా కాంగ్రెసుఅధ్యక్షుడు శ్రీలాలా అవతార్ నారాయణ్ గారు శ్రీ స్వామి శివశంకరగారు సత్యాగ్రహంచేసినందుకు అరెస్టుచేయబడిరి.

## ౭౧యేండ్ల కాంగ్రెసువాదికిశిక్ష

౭౧యేండ్లకాంగ్రెసువాది శ్రీశాంతమంగల్ సింగుగారు యుద్ధప్రతికూలమైన మూడుఉపన్యాసములిచ్చిన నేరములకు ఒక్కొక్కదానికి ౯నెలలకఠినశిక్షవిధింపబడిరి. శిక్షలు ఒకేమారు అనుభవించవలెను.

## సత్యాగ్రహులపై న్యూసెన్సు కేసు

కర్నూలుజిల్లాలో పత్తికొండకు ఆరుమైళ్ళ దూరములోనున్న బురుజల గ్రామములో జనవరి ౧వతేది డి.వీరప్పగారు యుద్ధవ్యతిరేక నినాదములుగావించినందున అరెస్టు చేయబడిరి. అసమయములో ఆదోనితాలూకా హత్తిబెలిగల గ్రామనివాసియు సదరుతాలూకా కాంగ్రెసుసంఘ కార్యదర్శియునగు యస్. వెంకటేశ్వరరావుగారుకూడ యుద్ధవ్యతిరేక నినాదములు గావించిరి. వీరు ఆదోనితాలూకాలో సత్యాగ్రహముచేసియుండియు పోలీసు వారిచేఅరెస్టు కాబడక ఢిల్లీకిప్రయాణముచేయుచు బురుజలగ్రామమునకువచ్చియుండిరి. వీరినికూడఅరెస్టుచేసి డి.వీరప్పతోకూడ పత్తికొండకు తీసుకొనివచ్చిరి. డోనుడివిజనల్ మేజిస్ట్రేటు మహబూబుమియ్యాగారు పత్తికొండలో నుంచగావారిఅంగీకారముపై పైన తెలిపినయిరువురుసత్యాగ్రహులను రెండుగంటలవేపుపోలీసువశంలోనుంచి, పిదపవదలివేసిరి. పత్తికొండగ్రామములో ఫిబ్రవరి౧వతేది సారాయిదుకాణముల వేలము నకైయెక్కువజనులువచ్చియున్నందునపైన తెలిపిన ఇరువురుసత్యాగ్రహులు అజనులయెదుట నిలబడి యుద్ధపద్ధతిధనమివ్వరాదని ఉపన్యాసములుయిచ్చుచుండ తాలూకా ఆఫీసునవెలుపలనున్న ఒక పోలీసుజవాను వీరినిపిలిపించి పోలీసుస్టేషనులో కూర్చుండబెట్టి, రాకపోకలకు యిబ్బందికలుగచేసిరను నేరము ఆరోపించి న్యూసెన్సుకేసుచేసిరి అక్కడిసబ్ మేజిస్ట్రేటు వారలకు రాదినాల కఠినశిక్షను విధించిరి.

## గ్రామాధికారి సత్యాగ్రహము అధ్యక్షుడు

పూర్వపు ఒంగోలుజిల్లా బోర్డు అధ్యక్షుడు శ్రీ కామ్రబ్రహ్మానందరెడ్డి బి.ఏ.బి. ఎల్.గారు జనవరి౨౫వతారీఖున సత్యాగ్రహము చేయువలసియుండెను. వారుతూచాడు గ్రామమునకు భాయమునసబుగుటచే అపదవికి రాజీనామాఇచ్చువరకు సత్యాగ్రహ మొనరింపరాదని యుత్తరువు రాగా తమవంశ పారంపర్యవచ్చు గ్రామమునసబుపదవికి రాజీనామానిచ్చిరి. ఫిబ్రవరి౨౭వ తారీఖున వారు సత్యాగ్రహ మొనరించెదరు.

## పోలీసువారు సత్యాగ్రహిని అడవిలో వదలుట

౩—౨—౪౧సాయంకాలము కుప్పమునకు౧౫మైళ్ళదూరమునగల రామకుప్పం అను గ్రామము కోఆంధ్రరాష్ట్ర కాంగ్రెసుసభ్యులగు జి. వెంకట్రామయ్యగారు సత్యాగ్రహముచేసిరి. వారిని వెంకటగిరికోట సబుయిన్ స్పెక్టరు అరెస్టుచేసి వెంకటగిరికోట పోలీసుస్టేషనుకుతీసుకొనిపోయిరి ౪వ తేది ఉదయం వెంకట్రామయ్యగారిని వెంకటగిరికోట సబుయిన్ స్పెక్టరువారు విచారణకు చిత్తూరుకుతీసుకొనిపోవుచు, చిత్తూరుకు౨౦మైళ్లు యివతలకు బంగారుపాళ్యం జమీందారి అడవినున్నవరోడ్డులో వారినివదలివేసి ఇకపొమ్మనిరి. ఇట్లుఎందుకుచేసి వారని యినస్పెక్టరువారిని వెంకట్రామయ్యగారుఅడుగగా ఇది జిల్లాకలెక్టరు వుత్తరువు, మీరుమీవూరికిపొండిఅనిరి వెంకట్రామయ్యగారు కుప్పమునకువచ్చి మరలసత్యాగ్రహమునకైఆంధ్రరాష్ట్ర కాంగ్రెసుకార్యదర్శిగారికి వ్రాసుకొన్నారు.

[౫ వపేజీ చూడుడు)

# గోలకొండ గ్రంథాలయము

## జాతకకథాగుచ్ఛము

కవిసన్నిధానము సూర్యనారాయణ శాస్త్రిగారు దొరకుస్థలము, కవిగారు ౪౪ జీరా, గోకులము, సికింద్రాబాదు (దక్కన్), పుటలు ౧౦౧ వెల రూ ౧-౦-౦.

శాస్త్రిగారు ఇదివరలో జాతకకథలుకొన్ని ప్రకటించియుండిరి. ఇదిదాని తర్వాత రెండవభాగము ఇందు ౧౦ జాతకాలుకలవు. పద్యములలో ఎందునువచనములేదు. అచ్చుగూర్పు కాగితాలు బాహ్యస్వరూపము చాలాఅందముగున్నది. కవి తాధారాళముగా ప్రవహించినది. మంచిశైలి ఉపమానాలుముద్దుగా అందందలికినవి. జాతకకథలను నేటివరకు తెనుగులో, అందులో నుపద్యములలో వ్రాసినవారులేరు. వచనములో చాలవరకు పంచాఙ్గుల ఆదినారాయణశాస్త్రిగారు వ్రాసినారు. చిల్లరపల్లరగా యితరులును "సుజాత" పత్రికలో ప్రకటించియుండిరి. ఇప్పుడు అవసన్నిధానము సూర్యనారాయణశాస్త్రి యీయుత్తమకావ్యాన్ని ఆంధ్రులకు సమర్పించినారు. జాతకకథలు ఇంకా కొల్లలుగాఉన్నవి. అందులోని ఉత్తమములైనవాటిని విడువకుండా శాస్త్రిగారుముగించి ఆంధ్రములో ఈకథలు ఇంకవరకు లేనిలోపాన్ని తొలగింపగలరు.

ముందు మూడవసంపుటము వెలువడితే అందు శాస్త్రిగారు జాతకకథలనుగురించి వాటికాలము, వాటినిరచించినకవుల పేరులుచరిత్ర, వాటి నాధారముగాగొనిరచించిన శిల్పవిశేషాలు, ఇంగ్లీషులోని అనువాదాలు, ఆంధ్రభాషలో ఇంతవరకు వీటిని గురించిచేసినచర్చ, పాలీ, ప్రాకృతసంస్కృత భాషలలో ఏయే గ్రంథాలువీటికాధార భూతములుఅనువిషయాలనుచర్చించి పరిచయముకలిగించితే బాగుండునని సూచించబడుచున్నది.

—=

## (వాట్ నెక్స్టు) What next

కర్త లక్ష్మణరావుగారూ హైకోర్టు వకీలు, హైదరాబాదు (దక్కన్) పుటలు ౩౪ వెల ౨ అణాలు ప్రకాశకులు చీప్ పబ్లికేషన్ కంపెనీ, ౧౬౪ బి. తూపుబజారు, హైదరాబాదు దక్కన్

ఇదిఇంగ్లీషులో వ్రాయబడినగ్రంథము బ్యారిస్టరు వినాయకరావుగారు పీఠికవ్రాసినారు. ఇందు హైదరాబాదులోని రాజకీయవిద్యాపరిస్థితులనుగురించి గ్రంథకర్తగారు తమఅభిప్రాయములను వెల్లడించినారు. హిందూదృక్పథముతో కొన్ని సలహాలనిచ్చినారు. హిందువులలో సరియైన నాయకత్వములేదనియు, హిందువులకోరికలకు వెనుకబలము (Sanction) లేదనియు, ఇప్పటి వాతావరణములో ఇత్తిహాదుల్ ముస్లిమీన్ సంఘానికే అనుకూలతకలదనియు, సాంప్రదాయకత (అనగా మతసాంఘికత) లేని స్టేటుకాంగ్రెసు పుట్టకముందే గిట్టింపబడెననియు, విద్యావ్యాపకము ఎచటయు అగుటలేదనియు గ్రంథకర్తగారు దర్శించినారు. కొన్ని వాక్యాలు మొగమోటములేకుండా ఘాటుగా వ్రాసినారు. వీరిఅన్ని అభిప్రాయాలతో అందరు నుఏకీభవించకపోవచ్చును. కానివీరిదృక్పథమును నాయకులుగమనింపవలెను. హిందువులలో గ్రంథకర్తగారన్నట్లుగా నాయకులులేరు. బహునాయకత్వము, స్వయంనాయకత్వము, స్వార్థతతోకూడిన నాయకత్వము, ఎక్కువగాఉన్నదని కొంతవరకుఒప్పుకోవచ్చును. హిందువులలో భిన్నత్వము ఎక్కువగాఉన్నది. అవర్ణాలలోను నాయకులుభిన్నించినారు. కార్యసాధనతక్కువ, ఈలోపాలనుపోగొట్టుటకై హిందూనాయకులందరును ఒకసారిసమావేశమై బాగుగాఆలోచించి ఒకగట్టి నిర్ణయానికి వచ్చినబాగుండును,

— —

## హిందూమహమ్మదీయులకు సమిష్టి ఉత్సవాలు

పంజాబు ప్రధాన న్యాయమూర్తి సలహా

లాహోరు, ఫిబ్రవరి ౨

హిందువులును మహమ్మదీయులునుకలిసి పండుగలు ఉత్సవములు సమిష్టిగాచేయుచున్నయెడల హిందూమహమ్మదీయస్పర్థలు మాయమగును. అని పంజాబు ప్రధానన్యాయమూర్తి డగ్లసుయంగుగారు నేడు పంజాబుసాహిత్యసమితివారిచే ఏర్పాటుచేయబడిన యొక గానసమ్మేళనమునకు అధ్యక్షతవహించి చెప్పిరి. సాంఘికవిభేదములను అంతరింపజేయుటకు భారతీయులే ముందుగా పూనుకోవలెను. ఈసాంఘిక సమస్యా పరిష్కారభారమును ప్రభుత్వమునకు విడిచిపెట్టరాదు- అనిరి.

=—

## సుభాష్‌బాబుగారి ఆస్తిఆక్రమణమునకై ఆజ్ఞ

కలకత్తా, ఫిబ్రవరి ౩

నేడుప్రజలు, న్యాయవాదులు, న్యాయస్థానమందు సుభాష్‌బాబుగారినిగురించి తెలుసుకొను ఉద్దేశముతో క్రిక్కిరిసియుండిరి. రక్షకశాఖవారు సుభాష్‌బాబుగారి సంగతియేమియు తెలియదని ౧౦వమార్చివరకు గడువుకోరిరి. న్యాయాధికారి సుభాష్‌బాబుగారి ఆస్తిఆక్రమణకై ఆజ్ఞయు అరెస్టుకై గడువునిచ్చిరి.

—=

## కొచ్చినుబాల్యవివాహ నిషేధశాసనము

కొచ్చినుశాసనసభవారు ఆమోదించిన బాల్యవివాహనిషేధ శాసనమునకు కొచ్చినుమహారాజుగారు ఆమోదించినట్లు పోయినజనవరి ౨౮వతేది నాటి కొచ్చినుశాసనసభసమావేశములో ఆ సభ కార్యదర్శిగారు ప్రకటించినారు, ఈ శాసనప్రకారము ౧౮ఏండ్లకంటే చిన్నపురుషులకును,౧౪ ఏండ్లకంటే చిన్నబాలికలకును వివాహముచేయరాదు. చేసినచో రూ౧౦౦౦జుర్మానా విధించబడును. మొదటితరగతి మేజిస్ట్రేటుకంటె తక్కువకానివాడు ఈసంబంధములైన అభియోగములను విచారణచేయదగును. మరియు న్యాయాధికారికి ఈశాసనానికివ్యతిరేకములైన వివాహములనుఆపివేయుటకు అధికారమున్నది అట్లుఆపివేయవలసినదని ఆజ్ఞాపించినపుడు ఆపివేయనిచో జుర్మానాగాని, ఖైదుగాని, లేకరెండుగాని విధించవచ్చును. అయితే స్త్రీకిఖైదుశిక్ష విధింపరాదు. ఈశాసనమునకువిరుద్ధముగా వివాహము చేసుకొనువారికి జుర్మానాయేగాక శిక్షకూడవిధింపవచ్చును.

—

## హిందూమహాసభవారి ప్రత్యక్షచర్య

రాష్ట్రములలో చర్యాసంఘములు

హిందూమహాసభయొక్క "చర్యాసంఘము" జనవరి౨౯వతేదిన ఢిల్లీలోఆమోదించిన ఒకతీర్మానమునుబట్టి హిందూమహాసభ అవలంబించదలచినప్రత్యక్షచర్యలో పాల్గొనుటకై వాలంటీరులను చేర్చుకొనుటకున్నూ అనేకవిషయములను నిర్వర్తించుటకై రాష్ట్రములలోను, జిల్లాలలోను "చర్యాసంఘము"లనువాటిని ఏర్పరచవలెనని కోరబడినది.

—=











సంవత్సరము
ఒక సంవత్సరము
సంవత్సరానికి
బ్రిటిషిండియాకు
సంవత్సరము చందా
పాతప్రతులకు
వెల ప్రత్యేకము.

# గోలకొండ పత్రిక

# Golkonda Patrika

The only Popular Paper That reaches The masses In the Dominions

Best Medium for Advertisement

PUBLISHED ON EVERY MONDAY AND THURSDAY

Volume 15 | Hyderabad-Dn. | Monday 10 February 1941 | Number 77


## స్టేటు మెడికలు కౌన్సిలును గూర్చి ఖాన్గీడాక్టరుల ఆక్షేపణ

### హైదరాబాదు, సికింద్రాబాదు డాక్టరుల స మా వే శ ము

హైదరాబాదు ఫిబ్రవరి ౫

సికింద్రాబాదు, హైదరాబాదు ఖాన్గీడాక్టరు లసమావేశము డాక్టరు జి. కె. కిర్లోస్కరు గారి అధ్యక్షతలో నిన్న నారాయణగూడెంలో వై. యం. సి. ఏ. వారిభవనములో జరిగెను. రెండువందల ఖాన్గీవైద్యులువచ్చిరి. హైదరాబాదు స్టేటు మెడికలు కౌన్సిలులో ఖాన్గీడాక్టరులను చేర్చుకొనలేదనియు, వారలఅభిప్రాయములను కనుగొనలేదనియు చర్చించిరి.

డాక్టర్ జయసూర్య నాయుడుగారు ఉపన్యసించుచు మెడికల్ కౌన్సిల్ ప్రారంభోత్సవమునాడు అసభలోనుండి డాక్టరు లతీఫ్ సయ్యదు మున్నగు డాక్టరులు లేచివచ్చుట న్యాయమేనని సమర్థించిరి. ఇపుడుండే మెడికల్ కౌన్సిల్ శాసనము ప్రకారము చేసిన ఉపనియమాలను ఖాన్గీడాక్టరులఅభిప్రాయానికి ప్రపంచలేదు కాబట్టియు ఇపుడే ర్పరచబడిన రిజిష్ట్రారు వైద్యుడు కాడు కాబట్టియు స్టేట్ మెడికల్ కౌన్సిలుకు ఎన్నికలు పెట్టుటయు, రిజిష్ట్రారును నియమించుటయు సరియైనవి కావని చెప్పిరి.

డాక్టరు రామచంద్రన్ గారు ఉపన్యసించుచు ఇపుడేర్పడినట్టి హైదరాబాదులోని వైద్యులకు మెడికల్ కౌన్సిలులో ప్రతినిధులు లేరనియు, ఈ రాష్ట్రంలో రిజిష్టరు చేయించుకొని యున్నట్టి వైద్యులఅభిప్రాయమును కనుగొననందుకు ఆక్షేపణ తెలుపవలయుననియు చెప్పిరి.

**తీర్మానములు**

ఈసభవారు మెడికల్ కౌన్సిల్ ప్రారంభోత్సవమునాడు డాక్టర్ లతీఫ్ సయ్యదు మున్నగువారు ఆక్షేపణసూచకంగా లేచివచ్చుట సరియైన దేయని తీర్మానించి ఇపుడు ఏర్పాటు చేయబడిన ప్రకారము మెడికల్ కౌన్సిలు ఉండుటకు మేము సమ్మతము కాదనిరి. రెండవ తీర్మానములో మెడికల్ కౌన్సిల్ ప్రారంభోత్సవమునాడు డాక్టరు లతీఫ్ సయ్యదు మున్నగువారు లేచివచ్చినది మెడికల్ కౌన్సిలు కొన్ని తీర్మానములయొక్క ఆక్షేపణ తెలుపుటకు లేచివచ్చుట కంటె గత్యంతరము లేకుండుటవల్లనే గాని, ఆ ప్రారంభోత్సవము ... ప్రధానమంత్రి గారియొక్క అమర్యాద ... కొరకని మనవి చేసికొనబడినది. మూడవ తీర్మానంలో ఖాన్గీ వైద్యులకు ప్రతినిధులు మెడికల్ కౌన్సిలులో సరిగా వచ్చేటట్లు చేసినట్లయితే ఇంతవరకు తమపేర్లను రిజిష్టరు చేయించుకొనవట్టి తమలోని ఖాన్గీ వైద్యులు ఇకముందు రిజిష్టరు చేయించుకొనగలరని చెప్పబడినది, నాల్గవ తీర్మానంలో వైద్యులని మెడికలు కౌన్సిలులో చేర్చనందుకు ఆక్షేపణ తెలుపబడినది, ఈ రాష్ట్రంలో ఇండియా మెడికల్ అసోసియేషనుయొక్క శాఖ, బ్రిటిషు మెడికల్ అసోసియేషనుయొక్క శాఖయును పనిచేయుచున్నవనుసంగతి ఐదవ తీర్మానంలో అధికారులదృష్టికి తేబడినది,

పైతీర్మానాలలో వివరించబడగిన విషయాలవిచరణకు మెడికల్ కౌన్సిల్ ఆక్టు, దానిఉపనియమాలనుండి ఉదాహరణలతో సహా ఒక ప్రకటన ఖాన్గీవైద్యునికిని అందచేయుటకై డాక్టరు లతీఫ్ సయ్యదు, డాక్టరు జె.యస్. మేల్కోట్, డాక్టరు రాంచంద్రన్, డాక్టరు అబ్దుల్ హై, డాక్టరు జయసూర్యనాయుడు, డాక్టరు శర్మ, డాక్టరు జహాంగీర్ గారలు సభ్యులుగాగల ఉపసంఘము ఏర్పాటు చేయబడెను,

ఈతీర్మానములను ప్రధానమంత్రి గారికిని, పత్రికలకును రాష్ట్రంలో ఇతరస్థలాలలోని డాక్టరులకును తెలియచేయుటకై డాక్టర్ మేల్కోట్ గారునియోగించబడిరి.

---

## ముత్యాలవర్షము

### వరంగల్లువద్దదృశ్యము

వరంగల్లు, ఫిబ్రవరి౫:—

నాలుగుదినాలకిందట యీప్రాంతంలో ప్రచండమైన వర్షము పడి పెద్దవడగండ్లతోబాటు యీతాలూకాలో వర్ధన్నపేటసరిహద్దున రెండు ఎకరములభూమిలో ముత్యములుపడినవి. అవి తెల్లగాను, మెత్తగాను ఉన్నవి, చాలమంది వాటిని దాచియుంచిరి. ప్రజలు ఒకవింతగా వీటిని చూచుచున్నారు.

ఇచట తినుపదార్థముల ధరలు పెరగటంచేత ప్రజలు చాలా తహతహలాడుచున్నారు. స్థానికాధికారులు తగ్గమార్గమును జూడవలెనని దరఖాస్తులు పెట్టుకొనబడెను.

ఆంధ్రపత్రిక

---

## సింధురాష్ట్ర కాంగ్రెసు సంఘాధ్యక్షునికి శి.క.

జనవరి ౨౬వ తారీఖున లాహోరులో సొసంగిన ఉపన్యాసమునకు గాను సింధురాష్ట్రీయ కాంగ్రెసు కమిటీ అధ్యక్షుడు డా॥ చైత్రామ్ గిద్వానీ గారికి ఫిబ్రవరి ౯వ తేది ౧౫౦ రూపాయిల జుల్మానా ... ౫౦౦ రూపాయలు జుర్మానా విధింపబడెను. కేసును విచారించిన లాహోరుజిల్లా మేజిస్ట్రేటు శ్రీ గిద్వానీగారికి ఏతరగతి యొసంగిరి.

అంతకుముందు శ్రీ గిద్వాని ఉపన్యాసాన్ని ఉల్లేఖించిన సి.ఐ.డి. రిపోర్టరుతోసహా ముగ్గురు సాక్షులు ప్రాసిక్యూషను తరఫున పరీక్షింపబడిరి.

డా. గిద్వానిగారు విచారణలో జోక్యంకలుగజేసుకొనలేదు.

డా॥ గిద్వానిగారి ఉపన్యాసమును వ్రాసికొన్న సి.ఐ డి. అసిస్టెంటు సబ్ ఇన్‌స్పెక్టరు సాక్ష్యమిచ్చుచు నిందితుడు తన ఉపన్యాసంలో యీక్రింది అభిప్రాయాలు వెలిబుచ్చినట్లు చెప్పెను. పంజాబు ప్రధాని బాలభటులకు సందేశంలో ప్రస్తుత యుద్ధం ధర్మయుద్ధమని వెలిబుచ్చిన అభిప్రాయాన్ని ప్రతిఘటిస్తూ భారతదేశం వెనుకటి పరిపాలనా సంగ్రామమున బ్రిటనుకు గొప్ప సహాయమొసగినందుకు ప్రతిఫలంగా స్వయం నిర్ణయాధికారంబదులు జలియనువాలాబాగు దురంతం రవలట్ చట్టం ప్రసాదింపబడెననిన్నీ, కాంగ్రెసుమంత్రివర్గములు రాజీనామా లివ్వటంవల్ల భారతీయులలో అధిక సంఖ్యాకులు యీ యుద్ధమునకు విముఖులనేవిషయం విదితమగుచున్నదనికూడా నిందితుడు చెప్పినట్లు సాక్షి పలికెను.

---

## గాంధిమహాత్మునికి పత్రికల విజ్ఞాపనము

### "హరిజన్" పత్రికలను తిరిగి ప్రచురింపగోరుట

#### దేశస్వాతంత్ర్యమునకు నిర్భయముగాపోరాడు సంకల్పము

#### ఢిల్లీపత్రికాసంపాదకుల సభవారి తీర్మానములు

క్రొత్తఢిల్లీ, ఫిబ్రవరి౯

పత్రికా సంపాదకులయొక్క స్థాయిసంఘము ఏకగ్రీవముగా ఈక్రిందితీర్మానముల నామోదించెను,

"నిర్భయముగా దేశ స్వాతంత్ర్యమునకై పోరాడుటకు భారతదేశమునందలి పత్రికలు కృతనిశ్చయమైయున్నట్లు ఈస్థాయిసంఘసభవారు ఉద్ఘాటించుచున్నారు. ఈకారణముచేత, దేశములో జరుగుచున్న రాజకీయోద్యమమును గూర్చిన వార్తలు తగినట్లు ప్రకటించుచుందురు, మరియు, భారతదేశపత్రికలు నాజీఫాసిస్టు నియంతృసిద్ధాంతములకు పూర్తిగా వ్యతిరేకముగానున్నవనియు, బ్రిటను తనశత్రువులతో సాగించుచున్న పోరాటమునకు అటంకము కలిగించుయుద్దేశ్యము లేదనియు నిండుమూలకముగా తెలుపుచున్నారు. కావున ఢిల్లీఒప్పందము సరిగా అమలుచేయుచుండవలెనని కోరుచున్నారు.

**మహాత్మునికి విజ్ఞప్తి**

"౧౯౪౦ అక్టోబరు మాసములో జారీచేసిన ప్రకటనమును ప్రభుత్వమువారు ఉపసంహరించుకొనియుండిరి గనుక, గాంధిగారి ప్రకటనలను నిషేధించు యుద్దేశ్యము లేదనియు, వాటి ప్రచురణలకు అవకాశములో సంగుద్దేశ్యము కలిగియుండిరనియు ప్రభుత్వమువారు సూచించి యుండుటచేతను, తిరిగి వీలయినప్పుడు మహాత్ముడు "హరిజన్" పత్రికలను ప్రచురించుచో ఈసభవారు సంతోషింతురని యిందుమూలకముగా మహాత్మునికి తెలుపుచున్నారు. మహాత్మునిచే ప్రకటింపబడుచుండిన వార్తాపత్రికలు తాత్కాలికముగా ఆగిపోవుటవలన పత్రికలకు తీరనికొరతకలిగినదని ఈసభవారు అభిప్రాయపడుచున్నారు."

**అధికారులకు సూచనలు**

"పత్రికలవారితో ఆలోచించుటకును, పత్రికలవారి సహకారము గైకొనుటకును గావింపబడియుండిన యేర్పాటులను అభివృద్ధిపరచుటకు గాను ఈక్రింది సూచనలు ప్రభుత్వమువారిచేత పరిశీలింపబడవలెనని ఈసభవారు అభిప్రాయ పడుచున్నారు:— (౧) పత్రికలకుపంపు ఉత్తరువులు వ్రాతపూర్వకముగాను ఉండవలెను, అధికారిసంతకము దానిలో నుండవలెను. (౨) పత్రికలస్థితి ప్రజలకు బాగుగా తెలియగలందులకు గాను, దేశరక్షణ, సైన్యము, విదేశాంగవ్యవహారములకు సంబంధించిన పర్యాలోచనలు అనగా ప్రకటనలే గాక తక్కినవిషయములన్నియు పత్రికలలో ప్రకటించుట కనుమతింపవలెను (౩. సోదాలు, అరెస్టులు జరుగనున్నప్పుడు తప్పుపత్రికలు, పత్రికలలోనివారిపై పోలీసులధికారుల ప్రయోగింపరాదు ౪ రాష్ట్రీయపత్రికా సలహాదార్లసంఘసభలకు ఆయా రాష్ట్రములయందలి ప్రభుత్వప్రధాన కార్యదర్శులు హాజరుకావలెను. ౫ ప్రభుత్వమువారు జారీచేయదలచిన ఉత్తరువులన్నియు, వీలైనప్పుడెల్ల మొదట కేంద్రపత్రికా సలహాసంఘమువారితోను, తరువాత రాష్ట్రీయపత్రికా సలహాసంఘమువారితోను చర్చింపబడవలెను. ప్రభుత్వమువారికిని, సలహాసంఘములకును ఏకాభిప్రాయము కలుగనప్పుడది పత్రికాసంపాదకులస్థాయిసంఘసభవారితో చర్చింపబడవలెను కేంద్రపత్రికా సలహాదార్లకమిటీతో ఆలోచింపకుండ, అత్యవసరముగా ప్రభుత్వమువారు ఉత్తరవుజారీచేయవలసి వచ్చినప్పుడు అవిషయమును కేంద్రపత్రికాసలహాదారుల మరుసటిసభ తెల్పవలెను.

౬. నిబంధనలు, ఉత్తరువుల విషయమునను, ముఖ్యముగా సత్యాగ్రహవార్తల విషయమునను అన్ని రాష్ట్రములలోను ఒకేపద్ధతి అవలంబింపబడవలెను.

---

## రెడ్ క్రాస్ నిధి

### కాంగ్రెసువారు చందాలిచ్చే విషయమై మహాత్ముని అభిప్రాయం

వర్ధాగంజ్, ఫిబ్రవరి ౫:

కాంగ్రెసువారు రెడ్ క్రాస్ నిధికి చందాయిచ్చుటగాని లేక రెడ్ క్రాస్ సంఘములో తర్ఫీదుపొందుటగాని చేయుట క్రమశిక్షణకు భంగమని నేను గతించును, కాని కాంగ్రెసువారు లేక లేని యితరుల ప్రోద్బలమునకు లొంగిగాని లేక అధికారులను సంతృప్తిపరుచవలెనను స్వార్థపరత్వముచేతగాని రెడ్ క్రాస్ నిధికి చందాలిచ్చుట మాత్రం తేరేవిషయమనియు దానినితాను ఒప్పుకొననియు మహాత్మా గాంధిగారు నెల్లూరుజిల్లా జడ్జిమూర్తి గారు రెడ్ క్రాసు సంఘోద్దేశ్యముల గూర్చి మహాత్ముని అభిప్రాయం పొందుటకు వ్రాసిన ఉత్తరమునకు బదులువ్రాసిరి.

---

## రామచంద్ర తిలకు నిరాహారదీక్ష విరమించుట

### సర్దారు పటేలుగారి అభయహస్తం

పూనా, ఫిబ్రవరి ౩

స్వర్గీయులోకమాన్య తిలకుగారి కుమారులైన రామచంద్రతిలకుగారు "కేసరి" "మరాటా" పత్రికలఆస్తులను కాంగ్రెసుమహాసభకు ఒప్పచెప్పవలెననిఆస్తులధర్మనిర్వాహకులను కోరెను. వారలు అందుకు నిరాకరించిరి. వారు అంగీకరించేవరకును తాను ఆహారము భుజించనని ప్రతిజ్ఞచేసి నిరాహారదీక్షపూనెను. కాని, జెయిలులోనున్న సర్దారు పటేలుగారు తాము జెయిలులోనుండి విడుదలయై వచ్చినపిమ్మట అవిషయమై ఆలోచించెదమని అభయహస్తమొసంగిరి. అందుచే తిలకుగారు సమాధానపడి, నేడు సాయంకాలం నారింజపండ్లరసం స్వీకరించిరి. జనవరి ౧౬వ తేదినుండి నిరశనదీక్షచేసియుండిరి. బొంబాయి పూర్వప్రధాని ఖేరుగారికుమారుని ద్వారా పటేలుగారు కబురుచేసిరి. కాంగ్రెసు కార్యదర్శి జే. బి. కృపాలనీగారు కూడా అట్టి అభయహస్తమునే యొసంగిరి. త్వరలో వారుకోరినవిషయమై ఆలోచించిరి. కాంగ్రెసు సభానిర్ణయము తెలియజేసెదమనిరి.

---

## జనపరిగణనలో ముసల్మానుల అవసరము

### నవాబు బహద్దూరు యార్జంగుగారి ఉపన్యాసము

(హైదరాబాదు దక్కన్) ఫర్వర్ది ౩

నవాబు బహదర్ యార్ జంగ్ బహదర్ గారు మక్కామసీదులో ఉపర్వర్దినాడు ఉపన్యసించుచు ఇట్లుచెప్పిరి:—

జిల్లాలను, పల్లెలను, పటేలుపట్వారీల వశములోనున్నవి. వారలవిషయమై ఆక్షేపణలు చాలవచ్చుచున్నవి. గాన ప్రభుత్వమువారు, వారలవెంట ఒకమహమ్మదీయ షుమారుదారుని దానుంచవలెను. షుమారు కునిందాలకు మా రజాకారులను తీసుకొనుచుండినట్లయితే, ప్రభుత్వమువారి బద్లీ ఉపాధ్యాయులను ఏర్పాటుచేయవలెను. ప్రభుత్వము ఈవిధముగా చేయనిచో మహమ్మదీయులకు జనపరిగణనమందు నమ్మకముండదు.

సభలోవారు మహమ్మదీయులతో మహమ్మదీయులు తమనిజమైన సంఖ్యను వ్రాయించవలెను. ఇతరులు తమ సంఖ్యను అసత్యముగా వ్రాయించకుండ గమనించవలెను. జనపరిగణనమందు ఇతరులు తమసంఖ్యను సరియైనవిధముగా వ్రాయించుటలేదు. వారలు తమసంఖ్యను అధికముగా జనపరిగణనమందు చేర్పించుచు, మనసంఖ్యను తక్కువగా వ్రాయించుచున్నారు.

---



---

## బెంగాలునుండి ౪౦౦ మంది వెడలగొట్టబడిరి

### దేశరక్షణ నియమాలక్రింద చర్య

భారతదేశరక్షణ నియమాలు అమలుచేయబడినప్పటినుండియు ౪౦౦మంది బెంగాలునుండి వెడలగొట్టబడిరి. వీరిలో ౨౫మంది ఉత్తరువులనుల్లంఘించి అరెస్టయిరి, అని ఫిబ్రవరి ౬వతేది బెంగాలు అసెంబ్లీలో ప్రశ్నోత్తరముల సమయమున హోంమంత్రి నాజిముద్దీన్ గారు చెప్పిరి. మరియొక ప్రశ్నకు ప్రత్యుత్తరమొసంగుచు గతసెప్టెంబరు ౧౩, ౧౪, ౧౫, తారీఖులలో అరెస్టుచేయబడియుండినవారు వారివిడుదలకై తగినకాలమువచ్చునదని ప్రభుత్వము గారుతలచువరకు విచారణ లేకుండ జైలులో నుంచబడుదురని హోంమంత్రి చెప్పెను.

---


Printed and Published by, G. Ramakrishna Reddy at the Golkonda Power Press. Hyderabad Dn. Editor- S. Prathapa Reddy B. A B.L.